# దస్తావేజులమతలబులు

గ్రంథకర్త:

నేదునూరి వేంకటకృష్ణారావు పంతులుగారు

పూలపల్లి.



పబ్లిషరు:

స[illegible]కూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో.,

బెజవాడ.

# ఆయుర్వేద వైద్య సారము.



అర్యులారా!

ఆయుర్వేదమునందుండు సారమంతయు సంగ్రహించి ఆర్యుల ఆచరణలో నుంచుటకు అనువగుపద్ధతులపై నీ ఆయుర్వేదసార మను గ్రంథము గృహములో కూర్చుండియే జబ్బులు కుదుర్చుటకును, డాక్టర్లకొరకు పల్లెటూరువారు పట్నంవెంబడి తిరిగి పడిగాపులుబడి విసువు జెందకుండా నుండుటకును, చిన్నజబ్బు మొదలు పెద్దజబ్బువరకు ఔషధములు, తయారుజేయు విధమును, అందుల కనువగు వస్తువులెల్ల తమ చిన్నగ్రామమందే దొరకేటటువంటివిన్ని, మందను పానవిశేషముల తోనడచిన వెంటనేసుగుణము కనిపించుమహత్తరమగు మందులున్ను, యోగీశ్వరులచే కనిపెట్టబడిన చిన్నచిన్న చిట్కాలున్ను అదను ననుసరించి ప్రస్తుతకాలమునకు పనికివచ్చేలాగున గృహ యజమానులకు పథమసహాయముగా నుండుటకు ఆలోచించి, శ్రమలకోర్చి, డబ్బు వెచ్చించి, కొన్నివందలయేండ్లక్రితము కొందఱు మహానుభావులచే కనిపెట్టబడి వైద్యకుటుంబములలో ఘనతవహించిన త్రిపురారికుమారులు మార్కండేయులుగారిచే రచియింపబడి ప్రస్తుతము తయారుచేసివాడుచున్న మందులుయావత్తు నీ ఆయుర్వేదసారము ననుసరించి తయారుకాబడుచున్నవి. ఇంతవఱకు చాల సులభముగాను, సుముఖముగాను వున్న ఈగ్రంథప్రాశస్త్యము మేము బొగడుట చంద్రునికిఁ దివిటీజూపించుట యొకటియే మొదటికూర్పు కాపీలన్నియు చెల్లిపోయినవి.

వెల ౧ రూపాయి.

వలయువారు:—సరస్వతీ బుక్కు డిపో,
బెజవాడ, కృష్ణాజిల్లా.

# దస్తావేజుల మతలబు.



స్టాంపుడ్యూటీలతో అతి విపులముగా వ్రాసి
అచ్చువేయఁబడినది.

గ్రంథకర్త:

## నేదునూరి వెంకటకృష్ణారావు పంతులుగారు,

పూలపల్లి.



కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్‌డిపో,
బెజవాడ.

నాల్గవకూర్పు 2000.

తెనాలి: భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

 1932. [ వెల రు 0-12-0.

# సాధారణముగా వచ్చు స్టాంపు రేట్లు.

---

తనఖాకు నూ 1 కి రు 0—12—0 చొ॥ ఆలాగున 1000 రూపాయలకు మించని మొత్తమునకు ఆప్రకారము స్టాంపు. వేయిరూపాయిలకు మించినతర్వాత యెంతస్వల్పభాగమయినను 1500 లమీద పైప్రకారమే నూ 1 కి 0—12—0 చొప్పునను రు 1500 లకు మించినతర్వాత రు 2000 లకు పైవిధముగానే—ఏస్వల్పభాగమునకైనను ప్రతి రు 500 లను జేర్చి స్టాంపుడ్యూటీ పెట్టుచుండవలెను.

క్రయమునకు:—నూ 1 కి రు 1—8—0 చొ॥ పై నుదాహరించిన ప్రకారమే స్టాంపులపై వ్రాయబడవలెను.

ఇంకను కావలసియున్నయెడల యెగ్రిమెంట్లకు రు 0—12—0 స్టాంపుయే చాలును. కవుళ్ళ కదపాలుకూడా మతలబునందే చూడగోరెదము.

---

# విషయసూచిక.

# భూమిక.

పాఠకమహాశయులారా!

లోకములో నందగు యిప్పుడు లేఖరులయి దస్తావేజులు మొదలయినవి వ్రాయుటకు ప్రారంభించి పూర్తి చేయవలసిన విధమును ఆయాదస్తావేజులలో నుండవలసిన సారాంశములున్ను నిర్దుష్టసూత్రములున్ను పత్రపు శాసనములయొక్క విధియున్న రిజిష్టరీయొక్క మార్గములున్ను, తెలియక, తెలిసికొనుటకు ప్రయత్నించకనున్ను స్టాంపులు పాడుచేసియును సబురిజిష్ట్రారువారివల్ల నిందలకు లోనగుచు ధనము వృధావ్యయము చేయుచున్నారు. ఈవిధమును కనిపెట్టి మ॥రా॥శ్రీ తెన్నేటి మల్లువర్యులుగారు అను నొక సబురిజిష్ట్రారువారు కొంత కొరతదీర్చినారు. ఆ పుస్తకములోనున్న కొరతలను దీర్చియు యింకా కొన్ని సంగతులు చేర్చిన్ని ఆయా పత్రములకు స్టాంపుల వివరములు కిమ్మతులు చేర్చిన్ని వ్రాయుట ముఖ్యావసరమని నా స్నేహితులగు పసుపులేటి వెంకటరామయ్య అండు బ్రదర్సువారు నన్ను కోరినందున యీపుస్తకమును వ్రాయుటకు పూనుకుంటిని. ఇది చర్వితచర్వణంబని కొంతమంది అభిప్రాయపడ ననవసరము. ఒకసారి తేడాలు పరిశీలన చేసినవారికి దానికన్న యిది మిన్నయని ఒప్పుకొనకతప్పదు. ఈపుస్తకము దగ్గరయున్నయెడల యెటువంటి కాగితములు యేసందర్భములో యేరకములో వ్రాయవలసివచ్చినను యిక నొకరిసలహా పొందనవసరము లేక తనంతట తానే వ్రాయగలవాడు. ఒక కాగితము వ్రాయుటకు యెన్నివిధము లున్నవో అన్నివిధములుగను పనికి వచ్చేటట్లు వ్రాయబడ్డవి. యింతకన్న యెక్కువ వ్రాయవలసిన కాగి

తములు యిప్పటికి వాడుకలో లేవు. వాడుకలో వున్నమట్టుకు అన్నిటికి ముపాయిదాలు వ్రాయబడ్డవి.

ఆధారము దీనిని వుపయోగించువారలపై నిడి వారి భూమణకు పాత్రుడ కాగలను. దీనిని సాకల్యముగా చదివి అవసరమయినవి యేమయిన యున్న యెడల పునర్ముద్రణంబున సవరించుకొందను.

## లేఖరి చేయు విధము

స్పష్టముగాని కాగితముగాని వ్రాయుటకు ప్రారంభింపక పూర్వమే సదసుదస్తాపేజిగాని కాగితముగాని రెండువైపులను సాధ్యమయినంత మార్జిను వుండునట్లు మడచి మధ్యకుకూడ మడచవలయును. అలాగున మడచిన యెడల దగ్గరలోనే హద్దువుండుటవల్ల పంక్తులు వంకర రాకుండుటయే కాక చూపరులకు చాల యింపుగా నుండును. యింతియేకాక ఒకానొకసందర్భములో అక్షరములు మరచి, మరచిన అక్షరములు యెక్కడ చేర్చుటకును అసందర్భముగా నుండునట్టి సమయములో మార్జినులో చేర్చవచ్చును. పంక్తులకు కావసినంత వెడల్పున రూళ్ళు వేయుట మంచిది. ఆరూళ్ళు కాగితముపయిన అంటి అంటకయుండునట్లు వేయవలయును. విస్తారముగా నొక్కి వేసిన యెడల అట్టిరూళ్ళపై వ్రాసిన వ్రాత గీతపై వ్రాసినట్టువుండి సౌందర్యముగా నుండకపోవచ్చును.

## మఱియొకటి.

వ్రాయు అక్షరములు గొలుసుకట్టు అయినను విడిఅక్షరములు అయినను ఒకమోస్తరు గొలుసుకట్టు వారివారియొక్క అలవాటు ప్రకారము వ్రాయుదురు. అట్టివారు యెట్టివారుఅయినను యేఅక్షరముల యొక్క సందర్భము యేలాగున యున్నను యీదిగువ నుదహరించిన అక్షరములు సరియగు స్పష్టనే యుండవలయును గాని సందిగ్ధముగా

వుండకూడదు. వా, పా, మా, మ్రా, స, న, యీ అక్షరములు అసం దిగ్ధములుగ యున్నయెడల అనేక అర్థములుపోయి వ్యతిరేకార్థములువచ్చి చాలా చిక్కులు తటస్థమగును. మొదటి రెండు అక్షరములలోను తగాయిదాలు వచ్చిన విధము మాత్రము చెప్పి మిగిలినవాటిని గ్రంథవిస్తరమును చేసి పాఠకులకు విసుగు కలిగించక మానివేతును. పాయిదా తప్పిన పాయిదాకు పాయిదా యిస్తును. పాయిదాకు యిస్తును ఈలా యున్నయెడల అర్థము చేయుటకు కష్టము చాలా చిక్కులకు ఆధారము గనుక పొందికగా భేదము కనుపడునట్లు వ్రాయుట మంచిది. సిరా కరక్కాయ సిరా చాలా మంచిది. ఫౌంటేను పెన్ సిరాగాని, బిళ్ళల సిరాగాని, పౌడరు సిరాగాని తడి తగిలిన వెంటనే కొన్ని సిరాలు పోవును. కొంతకాలము ఆలస్యమయిన వెంటనే వ్రాత కనబడక పోవును. కనుక కరక్కాయ సిరాయే మంచిది. దస్తావేజులలో వుండవలసిన సారాంశమును విడువకూడదు. విశేషము సారాంశములు చేర్చి అనవసర సారాంశములు చేర్చకూడదు. నాకన్న యెక్కువ ముసాయిదా వ్రాయువారు లేరని కొంతమంది విశేషముగా వ్రాయుదురు. అది మంచిది కాదు. నోట్సు మొదట వ్రాసి ఆపయిన తనఖా అనుసరించి వ్రాత క్రమము. ఆఖరునవీలు. యివి అంతరవ్యములుగనుక నోట్సు ముసాయిదానే మొదట ప్రారంభించితిని. అన్ని దస్తావేజులలోను తనఖా దస్తావేజుల వ్రాయుట చాలా కష్టము. చాలా జాగ్రత్తగా గమనించవలయును. ముఖ్యముగా గమనించవలసిన విషయములు లేఖరి వ్రాత నారంభించక పూర్వమే వ్రాయు దస్తావేజుమీద తారీఖును చూడవలయును. దానిమీదవున్న తారీఖు దగిమిలా తారీఖు వుండవలయునే కాని పూర్వపు తారీఖు వుండకూడదు. తారీఖు అంకెలతో మాత్రమేగాక అక్షరములతోగూడ వ్రాయవలయును. దస్తావేజులలో యెక్కడ తుడుపులు, హంసపాదులు వచ్చినను తారీఖులలో మాత్రము హంశ

ములలో తుడుపులుగాని హాంసపాదులుగాని సవరణలుగాని లేకుండ వ్రాయుట మంచిది. దస్తావేజు అనగా స్టాంపుఅయితే సరే రెండు మూడు పృష్ఠములను పేజీనంబరు ననుసరించి వ్రాయవలయును. తుడుపులు హాంసపాదులుగల చోట్ల వ్రాసి యిచ్చువానియొక్క యింటిపేరు పేరుయొక్క పొడియక్షరములు కరా జోగయ్య క॥ జో॥ అని వ్రాసిచోటను ఆఖరు కాకితము పూర్తిఅయిన తరువాత వ్రాసియిచ్చువాని యొక్క వ్రాలు లేక నిశానీల వుంచుటకు పూర్వమే అట్టి హాంసపాదులు తుడుపులు వగయిరాలు (1 పేజి 10 పంక్తిలో 1 తుడుపు. 2 పేజిలో 8 పంక్తిలో 1 హాంసపాదు.)

ఈలాగున వ్రాసి తప్పిదము వ్రాసినతరువాత వ్రాలు లేక నిశానీలు చేయించి దరిమిలాను సాక్షులువ్రాళ్లు చేయించి లేఖరి తన దస్తూరిని చేయవలయును. సాక్షి వ్రాళ్ళు చేయువారు తండ్రిపేరు కాపురం గ్రామముతో కూడా చేయుట మంచిది.

ఆలాగుననే దస్తూరి గారు దస్తూరికూడా వేయుట మంచిది.

లేఖరి స్టాంపు వ్రాయుట ప్రారంభించక పూర్వము ముఖ్యముగా స్టాంపు కొనబడిన వెండరుగారి ఆ తారీఖుగాని దాని దరిమిల తారీఖుగాని వేసి ప్రారంభించవలయును. ఆలాగున చూడకపోయిన యెడల స్టాంపుఖర్చుకు ముందు తారీఖుపడి చాలా చిక్కులకు లోనగుదురు.

ముఖ్యముగా రిజష్టరీ కావలసిన దస్తావేజుల వయినము యీ క్రింద పొందుపర్చుచున్నాను.

ఈక్రింద చెప్పబడియుండు దస్తావేజులు, ఏయాస్తికి సంబంధపడుచున్నదో ఆయాస్తి 1864 వ సం॥రపు 16 వ ఆక్టుగాని 1866 వ సం॥రము ఇండియాదేశపు రిజిష్ట్రేషను ఆక్టుగాని 1877 వ సం॥ రము ఇండియాదేశపు రిజిష్ట్రేషను ఆక్టుగాని, ఈయాక్టుగాని అమలులోనికి వచ్చిన తారీఖునగాని వచ్చేడి తారీఖునగాని ఆ తరువాతగాని ఆదస్తావేజును వ్రాయబడిన పక్షమునకును వానిని రిజిష్టరు చేయవలయును.

**A** స్థిరాస్థిని గురించిన దానపత్రములు.

**B** ఇప్పటికి చెందియుండిన దయినను సరియే, ముందు కలుగ బోవునదయినను సరియే, స్థిరాస్థితి లేక స్థిరాస్థి విషయములో వంద రూపాయల విలువయును అంతకంటె ఎక్కువవిలువయును, గల యే దయిన హక్కును బాధ్యతయును లేక స్వాతంత్ర్యమును తత్కాల మందయినను కలుగజేయునట్లుగాని రూఢిపఱచునట్లుగాని, ఇచ్చునట్లు గాని, కొట్టివేయునట్లుగాని, తాత్పర్యపడునట్టివియు లేక చేయునట్టి వియు నగు మరణశాసన సంబంధముకాని ఇతరసాధనములును—

**C** మరణశాసన సంబంధము కాకుండ ఏదయిన అట్టిహక్కును బాధ్యతయును లేక స్వాతంత్ర్యమును కలుగజేయుటకుగాను రూఢి పరచుటకుగాను, అచ్చుటకుగాను, మట్టిచేయుటకుగాను, లేక కొట్టి వేయుటకుగాను, ఏదైన పైకము పుచ్చుకొన్నట్టు లేక చెల్లించినట్టు ఒప్పుకొని వ్రాసియుండు సాధనములు.

**D** సంవత్సర సంవత్సరమునకుగాని, ఒక సంవత్సరమునకు మించిన యేకాలమున కయిననుగాని, సంవత్సరవారీగా గుత్తపైక మును ఇచ్చునట్లుగాని, చేసికొను స్థిరాస్థిని గురించిన కవుళ్లును:—

అయినను యేడిస్ట్రిక్టులోనయినను లేక డిస్ట్రిక్టులో చేరినభాగ ములోనయిన అయిదు సంవత్సరములకు మించకుండునట్లు వానివల్ల నిశ్చయముచేసికొనిన సంవత్సరవారీ గుత్తపైకము రు 50 యేబది రూపాయిలకు వ్రాసియిచ్చిన షరతులుగల కవుళ్ళు యీనస్పెషన్కు సంబంధపడనేరదని లోకలుఆఫీసుగెజిటులో ప్రచురపరచు వుత్తర ద్వారా లోకలుగవర్నమెంటువారు వానిని మినహాయించవచ్చును. కవుళ్లును రిజష్టరీ చేయవలయును. అనగా రు 50రూపాయులకు 5సం॥ రములకు మించిన ఒకజాయింటుస్టాకుకంపెనీవారి ఆస్తి యావత్తు లేక

అందులో కొంతవరకు స్థిరాస్థి వున్నప్పటికిన్ని అట్టికంపినీలోగల పాళ్ళతో చేరిన యేసాధనములనుగాని—

ఏసాధనమూలముగా అట్టి యేకంపెని వారయినను తమయొక్క యావత్తుస్థిరాస్థినిగాని అందలిభాగమునుగాని దానివిషయములో గల యేదయినస్వాతంత్ర్యమును అప్పుపత్రిమును ఉంచుకొన్నవారి ప్రయోజనముకొరకు ట్రస్టుమీద ట్రిస్టీలవద్ద తాకట్టువుంచిరో, వారి పరము చేసిరో, లేక మరియొకవిధముగా వారిపేరిట చేసిరో, రిజిష్టరు చేసినట్టిసాధనము ద్వారా కలుగచేయబడిన జామీనుకు దానిని వుంచుకొన్న వాడు హక్కుగలిగియున్నంతవరకు తప్ప, స్థిరాస్థి లేక స్థిరాస్థివిషయములోగల యేదయిన హక్కును, బాధ్యతను, స్వాతంత్ర్యమును కలుగజేయక రూఢిపఱుపక, ఇయ్యక, మట్టు చెయ్యక, లేక కొట్టివేయక, ఆ కంపెనీవారు వ్రాసియిచ్చిన యేదయిన అట్టి అప్పుపత్రములనుగాని:—

అట్టి యేకంపెనీవారయినను వ్రాసియిచ్చిన యేదయిన అప్పుపత్రముమీద నిండార్సుచేసి లేక ఆ పత్రమును మరియొక పేరిటికి మార్చి వ్రాసియిచ్చు విషయములనుగాని:—

స్థిరాస్థి లేక స్థిరాస్థివిషయములో వందరూపాయలవిలువగల అంతకంటె ఎక్కువవిలువగల ఏదయిన హక్కును బాధ్యతను లేక స్వాతంత్ర్యమును తానేకలుగజేయక రూఢిపఱుపక ఇయ్యక మట్టుచేయక లేక కొట్టివేయక మరియొకదస్తావేజు వ్రాయబడునప్పుడు ఏదయిన అట్టి హక్కును బాధ్యతను లేక స్వాతంత్ర్యమును కలుగజేయునో రూఢిపర

చునో ఇచ్చునో మట్టుచేయునో లేక కొట్టివేయునో అట్టిదానిని పొందుటకయిన హక్కుమాత్రము కలుగజేయునట్టి యేదయిన దస్తావేజు.

ఒకకోర్టువారి యేడిక్రీకి లేక ఉత్తరువునకుగాని లేక యేతీర్పునకుగాని,

గవర్నమెంటువారు ఇచ్చు స్థిరాస్తిని గురించిన యే దానశాసనమునకుగాని,

ఒకరెవిన్యూ ఉద్యోగస్థుడు వ్రాసియిచ్చు యే విభాగపత్రమునకుగాని,

1871 వ సం॥రపు భూవృద్ధిఋణముల యాక్టును అనుసరింపలేక 1883 వ సం॥రపు భూవృద్ధిఋణముల ఆక్టును అనుసరించి ఋణములు ఇచ్చునట్టి పైజామీనుసాధనమునకుగాని,

1884 వ సం॥రపు వ్యవసాయదార్ల ఋణముల యాక్టును అనుసరించి ఋణము ఇచ్చుటకు చేయునట్టి యేహక్కునకుగాని ఆయా హక్కుప్రకారము చేసినఋణమును తీరుగా చెల్లించుటకును భద్రపరచుటకునుగా నుండు సాధనముగాని,

తాకట్టుపైకము యావత్తు లేక అందలి యేభాగమునయిన చెల్లించునట్లు యొప్పుకొని తాకట్టుపత్రముమీద చేసిన యేయెండార్సుమెంటుకును తాకట్టుక్రింద అప్పుపైకము చెల్లించినందుకుయిచ్చియుండు యేదయిన వేయురశీదులో తాకట్టును కొట్టివేయులాగు అర్థము కానిపక్షమందు ఆరశీదునకుగాని,

బహిరంగమైన వేలములో సివిల్ ఆఫీసరుగాని రెవిన్యూఆఫీసరుగాని విక్రయించిన యేసొత్తునైనను కొన్నవారికియియ్యబడిన యేవిక్రయపు సర్టిఫికేటునకుగాని సంబంధపడనేరదు.

మరణశాసనమువల్ల అధికారము యివ్వబడని విషయములలో 1872 వ సం॥రము జనవరినెల మొదటితారీఖున తరువాత పుట్టినట్టి పుత్రస్వీకారాధికారపత్రికలను రిజష్టరుచేయవలయును. ఇట్లే కొన్ని హంశములు గ్రాహ్యాముచేసుకోకోరుచున్నాడను. రిజస్టరుయాక్టులోని హంశములే యిందు పొందుపరచడమైనది.

పూలవల్లి,
20-5-1929.

నేదునూరి వెంకటకృష్ణారావు,
గ్రంథకర్త.



# దస్తావేజుల మతలబు.



## నోటు మూషాయిదాలు.

సులభమార్గము.

రు 100 లకు.

దీ 4-4-1920 నాల్గవ తేదీ రౌద్రినామ సంవత్సరము. [illegible]

| పరాంకుశం గ్రామ కాపురస్తులు వ్యవసాయం, కమ్మవారు, రామవరపు కేశవరావుగారి కుమార్డు నారాయణరావు వ్రాయించి యిచ్చినది. | మజకూరు గ్రామ కాపురస్తులు ఈనాందార్లు బ్రాహ్మణులు అడవి అనంతయ్యగారికుమారుడు సుబ్బయ్యగారికి:— |
| --- | --- |

సదరు నూరురూపాయలుకు యింతటినుంచిసొమ్ముముట్టేవరకు నెల 1 కి నూటికి రు 1—0—0 చొ॥న వడ్డీతో పరాంకుశంగ్రామ కాపరస్తులు రఘుదేవపు వెంకటావ్రుగారి కుమారులు రామారావు గారికిగాని వారి ఆర్డరును ట్రాన్సుఫరుపొందినవారికిగాని అడిగిన తక్షణము చెల్లించగలందులకు పరాంకుశం గ్రామకాపురస్తులు రామవరపు కేశవరావుగారి కుమారుడు నారాయణరావునయిన నేను ఖరారుచేసినాను. యిందుల ప్రతిఫలము నాకుటుంబయుపయోగముకొరకుభోజన

ముకు ధాన్యము కొనుక్కునే నిమిత్తము మీవద్ద నగదు పుచ్చుకున్నాను గనుక పుట్టినది.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన ప్రామిసరీనోటు.

రామవరపు నారాయణరావువ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. విట్ట వీరవెంకటరావు సాక్షివ్రాలు, గుడివాడ.
2. కాశి వెంకన్న సాక్షివ్రాలు, సా॥ గోనేడ.

దస్తూరి—నారాయణభట్ల వెంకటాద్రి, సా॥ పరాంకుశం.

## విపులముగా వ్రాయునోటు
## నెం ౨౯

డి 4-4-1923 సం॥రం నాల్గప తేదీ యేప్రియలు పదొంమ్మిది వందల యిరవైమూడవ సం॥రం తేదిని.

రు 400 లకు.

| పరాంకుశపురం గ్రామకాపురస్తులు రఘుదేవపు వెంకటాద్రిపుగారి కుమారుడు రామారావుగారికి— | పరాంకుశపురం గ్రామకాపురస్తులు రామవరపు కేశవరావుగారి కుమారుడు నారాయణరావు వ్రాయించియిచ్చిన ప్రామిసరీనోటు. |
|---|---|

నాకుటుంబ అవసరము నిమిత్తము అనగా నాపెద్దకుమార్తె వివాహముఖర్చులు నిమిత్తము ఈరోజున బదులుపుచ్చుకున్నవి 400 నాలుగువందలరూపాయలుకు యింతటినుంచి సొమ్ముముట్టేవరకు వడ్డీకి నూటికి రు 0—12—0 పన్నెండుఅణాలచొ॥న వడ్డితో మీకుగాని మీఆర్డరు పొందినవారికిగాని అడిగినతక్షణం చెల్లించగలందులకు ఖరారుచేసినాను. యిందుల ప్రతిఫలము నైన వుదహరించిన అవసరము

నిమిత్తము నగదుపుచ్చుకున్నాను గనుక ముట్టినది. ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన ప్రామసరినోటు.

రామవరపు నారాయణరావువ్రాలు.

ఇందుకు సాక్షులు

1. సింగనాదం జీవరత్నము సాక్షివ్రాలు.
2. చేదాములు చెంచయ్య సాక్షివ్రాలు.

దస్తూరి—సుయిలవరపు సత్యనారాయణరావు, సా॥ పరాంకుశపురం

## కొంపొండుపడ్డితో కూడిన నోటు

## నెం 3 రు

రు 500 లకు.

బి 8-3-1928 యెనిమిదవ తేదీ మార్చి పందొమ్మిదివందల యిరువై యెనిమిదవ సంవత్సరము.

| | |
|---|---|
| కోటితాలూకా కోరంగి కాపు రస్తులు కొత్త వెంకయ్యగారి కుమారుడు సుబ్బయ్యగారికి— | కొత్తపేటతాలూకా అవిడిగ్రామ కాపురస్తులు పాతరగడ్డ పరాంకుశం పిళ్లే యితని సమిష్టికుమార్లు నారాయణపిళ్ళేభీమనపిళ్ళేమైనర్లు యిందున తండ్రి సంరక్షక కుటుంబ యజమానిఅయినపరాంకుశంపిళ్లే వ్రాయించియిచ్చినప్రాంశరీనోటు |

మాకుటుంబ అవసరమునిమిత్తము అనగా మాలో భీమనపిళ్ళ వివాహచర్యలనిమిత్తము మీవద్దబదులుపుచ్చుకొన్నరొఖ్ఖము రు500 అయిదువందలరూపాయలుకు యింతటినుంచి సొమ్ముముట్టువరకు నె1కి

నూ1కి రు 1—0—0 ఒకరూపాయిచొప్పున సాలువారి కాంపౌండు వడ్డీతో మీకుగాని మీఆర్డరును ట్రాన్సుఫరుహొందినవారికిగాని అడిగినతక్షణం చెల్లించి యీనోటుపైన చెల్లువ్రాయించి పుచ్చుకొందుము యిందుల ప్రతిఫలము పైన వుదహరించిన నామూడవకుమారుని వివాహచర్యలనిమిత్తము నగదుపుచ్చుకొన్నాము గనుక ముట్టినది. ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన ప్రామసరినోటు.

పాతరగడ్డ పరాంకుశంపిళ్ళె వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. అడివి అనంతం సాక్షి వ్రాలు.
2. గోవిదాన గోవిందం సాక్షి వ్రాలు.

దస్తూరి—దరగాని దొరయ్య, సా॥ కోరంగి.

# తనఖా దస్తావేజు.

8-3-1 28 యెనిమిదవ తేదీ మార్చి పందొమ్మిదివందల యిరవైయెనిమిదవ సంవత్సరము తేదీని.

| | |
|---|---|
| మాటుడదేవర కన్నయ్యగారికుమారుడు వేంకటరావుగారికి— | రాజవరం కాపరస్తులు ఛామన సుబ్బారావుగారికుమారుడు వెంకటరంగారావు వ్రాయించి యిచ్చిన ప్రామిశరీనోటు. |

నాఅవసరం నిమిత్తము రాజమహేంద్రవరములో యిల్లు కొనుక్కొనేనిమిత్తము యీరోజున మీవద్ద బదులుపుచ్చుకొన్న రొఖ్ఖము రు 1000—0—0 పదివందలరూపాయిలు యింతటినుంచి సొమ్ము ముట్టేవరకు నెల 1 కి నూటికి రు 0—12—0 లు చొప్పున సాలువారి కాంపౌండు యింట్రస్టుతో 9—3—1929 సం॥రం తేది లగాయతు 1933 సం॥రం మార్చి తొమ్మిదవతేదివరకు 5 సమువాయిదాలను ప్రతివాయిదాకు వాయిదా ఒక్కంటికి రు200—0—0 లు

రెండువందల రూపాయిలును వాయిదాకైన వడ్డీయున్ను వసూలు యిస్తూ పత్రింపిరీని చెల్లువ్రాయిస్తును. ఇది నా సమ్మతిని వ్రాయించి యిచ్చిన తనఖా దస్తావేజు.

ఘామన వెంకటరంగారావు వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. గోనుగుంట్ల గోపాలయ్య సాక్షి వ్రాలు.

2. చేబియ్యం వెంచయ్య సాక్షి వ్రాలు.

దస్తూరి—గోపాలం గోవిందయ్య, సా॥ రాజవరము.

# యిద్దరు కలిసి వ్రాసి యిచ్చిన నోటు.

| రాజమండ్రి ఇన్నీసుపేట కాపు రస్తులు వర్తకం పెంటా వెంకటస్వామి కుమారుడు వెంకటరమణయున్ను మజ్కూరు గ్రామ కాపురస్తులు వర్తకము బత్తులరామయ్య 2వ కుమార్డు వెంకటరమణయ్య యిద్దరు కలిసి వ్రాసియిచ్చిననోటు. | రాజమండ్రి గ్రామ కాపురస్తులు వైశ్యుల వర్తకులు సీమకుర్తి తాతయ్యగారి కుమారుడు జగన్నాథముగారికి— |
|---|---|

మేము యిద్దరము జాయింటుగా కొబ్బరి వర్తకము చేసేని మిత్తం ఖూవద్ద బదులు పుచ్చుకొన్నవి రు 2000—0—0 లు రెండువేల రూపాయిలు యింతటినుంచి సొమ్మును చెల్లించేవరకు నె1కి నూటికి రు 1—0—0 చొప్పున వడ్డీతో మీరుగాని మీయార్డరును పొందినవారికిగాని అడిగిన తక్షణము మాలో యెవరంబడితే వారము యిచ్చి యీ నోటుపైన చెల్లువ్రాయించి పుచ్చుకొందుము. ఇది మా సమ్మతిని వ్రాయించి యిచ్చిన నోటు.

పెంటా వెంకటరమణ వ్రాలు.

బత్తుల రమణయ్య వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. కలగాని కామయ్య సాక్షి వ్రాలు. సా॥ రాజమండ్రి.

2. ఎనుబోతుల అప్పలనాయుడు సాక్షి వ్రాలు. రాజమండ్రి.

దస్తూరి—దుర్గా రమణయ్య. సా॥ రాజమండ్రి.

# అస్వాధీనపు తనఖా.

రు 1000 లకు అస్వాధీనపు తనఖా దస్తావేజు.

కృష్ణాజిల్లా గుంటూరు తాలూకా నిడుమఱ్ఱు కాపురస్థులు క్షత్రియులు ఈనాందార్లు అయిన పూడి బాపిరాజుగారి కుమాళ్ళు వీరవెంకటబుచ్చి రంగరాజుగారికి—

కృష్ణాజిల్లా గుంటూరు తాలూకా నిడమఱ్ఱు కాపురస్థులు కాపులు వ్యవసాయము, సూరాబత్తుల చిట్టివెంకయ్యగారి కుమారుడు సత్యం వ్రాయించి యిచ్చినది.

ది 8—3—1921 యెనిమిదవ తేదీ మార్చి పందొమ్మిది వందల యిరువై వకటవ సంవత్సరము.

నాకుటుంబ అవసరముకు అనగా చెరుకుతోట పెట్టుబడి నిమిత్తము యీరోజున మీవద్ద బదులుపుచ్చుకొన్నవి రు 1000 పదివందల రూపాయలుకు యింతటినుంచి సొమ్ము ముట్టేవరకు నె 1 కి నూటికి రు 1—0—0 ఒకరూపాయి చొ॥న వడ్డీ యీదిగువ నుదహరించిన వాయిదాల ప్రకారము యిస్తును.

1922 మార్చి 30 తేదీనాటికి అసలు రెండువందల రూపాయిలును అందలి ఫాయిదాయున్ను,

1923 మార్చి 30 వ తేదీనాటికి అసలు రు 200 లు అందలి ఫాయిదాయున్ను,

1924 మార్చి 30 వ తేదీనాటికి అసలు రు 200 లు అందలి ఫాయిదాయున్ను,

1925 మార్చి 30 తేదినాటికి అసలు రు 200 లు అందలి ఫాయిదాయున్ను,

1926 మార్చి 30 తేదినాటికి అసలు రు 200 లు అందలి ఫాయిదాయున్ను,

ఈప్రకారము యిచ్చి యిచ్చినసొమ్ము యీపత్రము వెనుక పీఠీని చెల్లు వ్రాయిస్తును, అలా చెల్లులేని సాక్షి రసీదులు మంజూరు చేయ నిమిత్తము లేదు. ఆలాటివాదము నేను చేయగలవాడను కానని యిందుమూలముగా వప్పుకుంటున్నాను. పైన వుదహరించిన వాయిదాలతో యేవాయిదాసొమ్ము యివ్వక పోయిన రాగలవాయిదాలతో నిమిత్తములేకుండా అప్పటికి నిల్చివున్న అసలుఫాయిదాలు ఒక్కమారుగా యీతనఖా ఆస్థివల్లను నావల్లను నాతాలూకు యితరాస్థివల్లను ఒక్కమారుగా రాబట్టుకో వలయును.

తనఖా ఆస్తి వివరము.

కృష్ణాజిల్లా గుంటూరు తాలూకా లంకవరం సబుడిస్ట్రిక్టు నిడమర్రు గ్రామముతాలూకు డివిజన్ సర్వె నెం 389/1 సి రు య 10 సెం 20 ట్ల వుదియకరముల యిరవై శెంట్ల భూమిన్ని యిందలి ఫలవృక్షములు సహితము మీకు అస్వాధీనపు తనఖాయిచ్చి వాఆస్థి నాస్వాధీనములోనే యుంచుకున్నాను.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన అస్వాధీనపు తనఖా దస్తావేజు.

సూరాబత్తుల సత్యము నిశాని.

ఇందుకు సాక్షులు.

1. గోపాలపు గోపాలయ్య సాక్షి వ్రాలు.

2. చోపుదారి చెంచయ్య సాక్షి వ్రాలు.

దస్తూరి—చెంగల్వల పున్నయ్య, సా॥ నిడమర్రు.

తాలూకా వ్రాసినను వ్రాయకున్నను సబుడిస్ట్రిక్టు మాత్రము వ్రాయవలయును. సబుడిస్ట్రిక్టుఅంటే యేసబెరిజస్టరువారి ఆఫీసులో ఆదస్తావేజు రిజిస్టరు కావలయునో ఆసబురిజిస్ట్రారువారి అధికారమును తెలియవ్రాసి గ్రామము తనఖా దస్తావేజునుమాత్రము ఇద్దరుసాక్షుల సంతకములు వుండి తీరవలయును తక్కువ పనికిరాదు.

## నెం ౨ రు

రు 1500 లుకు అస్వాధీనపు తనఖా దస్తావేజు.

ది 9—2—1911 తొమ్మిదవ తేదీ ఫిబ్రివరి పందొమ్మిది వందల పదకొండవ సంవత్సరం.

రాజమండ్రి గ్రామ కాపురస్తులు తెలగాలు, వ్యవసాయము జన్ము వీర వెంకటరంగారావు గారి కుమారుడు ప్రసాదరావు గారికి — మజూకూరి గ్రామ కాపురస్తులు బ్రాహ్మణులు ఈనాందారులు సింగము శెట్టి చిట్టియ్య కుమారుడు పుల్లయ్య వ్రాసియిచ్చినది.

ఈ తేదీని మీవద్ద బదులు పుచ్చుకొన్నవి రు 1500 పదిహేను వందల రూపాయలును ఇంతటినుంచి సొమ్ము ముట్టేవరకు నె 1 కి నూటికి రు 0—11—0 చొ॥న వడ్డీతో ది 30 మార్చి 1911 సం॥రం లగాయతు 1921 సం॥రం మార్చి 30 తేదీవరకు పదిసమవాయిదాలను ప్రతిసం॥రం మార్చి 30 తేదీవరకు పత్రము మొత్తముకు అయిన వడ్డిన్ని అసలు రు 1500 లున్ను యీప్రకారము యిచ్చి ఇచ్చినసొమ్ము యీపత్రము వెనుకపీటిని చెల్లువ్రాయిస్తును, ఆలా చెల్లు లేని ఇతరదృష్టాంతరములు మంజూరుకాయనిమిత్తము లేదు. చెల్లు వ్రాయించుట తప్ప ఇతర దృష్టాంతరములున్నవను వాదమున్ను చేయ

గలవాడను కాను. ఇంతియేగాక పైన వుదహరించిన వాయిదాల ప్రకారము యియ్యకపోయినను అప్పటికి నిలిచియున్న వడ్డికికూడా యియర్లి కౌంపౌండు యింటిరెస్టు అనగా సాలువారి చక్రవాళ వృద్ధులతో సొమ్ము ముట్టేవరకు యియ్యగలవాడను. ఈతనఖాఆస్తి యిది యిదివరలో యెవరికి తనఖాలు హామీలు యిచ్చియుండలేదు. ముందు మీ బాకి తీరేపర్యంతము యెవరకు తనఖా హామీ యియ్యగలవాడనుకాను.

తనఖాఆస్తి వివరము.

తూర్పు గోదావరి డి॥ రంగాపురం సబుడి॥ రంగంపేటగ్రామం లోని పెంకుటింటికి హద్దులు.

గ॥ 11 తూర్పున బ్రిహ్మాబొట్ల వెంకటరామన్న యింటిగోడ.

11 దక్షిణము రంగావఝ్ఝల వెంకన్నదొడ్డి.

11 పడమర విసానిభొట్ల వీర వెంకన్నయిల్లు.

20 వుత్తరం షేకు మీరాసాహెబు మసీదుగోడ.

యీ హద్దులమధ్య స్థలమయిన పెంకుటిల్లు తల్పులు ద్వార బాధము యింటి పై కల్ప సహా మీకు అస్వాధీనపు తనఖా యిచ్చి తనఖా ఆస్తి నా స్వాధీనములో యుంచుకొని యూనియను అయితేనున్ను మునిసిపాలిటీ అయితే ఆ నెంబరుకూడా వ్రాయుము.

సింగముశెట్టి పుల్లయ్యవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. అడివి అనంతం సాక్షివ్రాలు.

2. గోలిదాన గోవిందం సాక్షివ్రాలు.

దస్తూరి—దరగాని దొరయ్య, సా॥ కోరంగి.

## నెం 3 రు

### రు 2000 లకు అస్వాధీనపు తనఖా దస్తావేజు.

ది 10—1—1898 సంవత్సరము.

అయినవర్రు గ్రామం కాపురస్థులు బ్రాహ్మణులు ఇనాందార్లు పప్పు విశ్వేశ్వర సోమయాజులు గారి కుమాళ్లు వెంకట చయనులు ఈయన సమిష్టి కుమాళ్లు నరసింహం బుచ్చి వెంకయ్య వ్రాయించియిచ్చినది—

అయినవర్రు గ్రామం కాపురస్థులు బ్రాహ్మణులు ఇనాందార్లు అన్నందేవర వెంకయ్యగారి కుమారుడు సీతారామశాస్త్రిలుగారికి—

ఈదిగువ నుదహరించిన తఖ్సీలుప్రకారము మీవద్ద బదులు పుచ్చుకున్నవి. రు 2000 రెండువేల రూపాయల్కు తఖ్సీలు.

నాపెద్దకుమారుడు అనగా మాలో నరసింహము వివాహము నిమిత్తము పి. రామచంద్రరావుగారివద్ద ది 10—1—1898 సంవత్సరం తేదీని బదులుపుచ్చుకుని వ్రాయించియిచ్చిన ప్రామిసరీనోటు తాలూకు ఈరోజునకయిన అసలుఫాయిదాలు మాలో చినవెంకయ్య 800—0—0

నాచిన్నకుమారుడు వుపనయనము నిమిత్తము ఆర్. వెంకటరంగారావుగారివద్ద 8—2—1896 సంవత్సరం తేదీని నోటు వ్రాయించి పుచ్చుకున్నవి. 600—0—0

యీరోజున మాకుటుంబ భోజనమునకు ధాన్యము వగైరాలు

కొనుక్కునే నిమిత్తమున్ను యింటిమరమ్మత్తు నిమిత్తమును ఈరోజున సబురిజిష్ట్రారువారి యెదుట బదులు పుచ్చుకున్నవి.

600—0—0

వెరశి 2000—0—0

వెరశి రెండువేల రూపాయలుకు యింతటినుంచి సొమ్ము పూర్తిగా ముట్టేవరకు నె 1 కి రు 1—0—0 చొప్పున వడ్డీతో సాలు 1 కి రు 500 లు చొ॥న 1899 సం॥రం జూన్ 15 తేదినాటికి ముందు అసలు క్రింద 500—0—0 లున్ను, యీలాగును అసలు యావత్తు తీరిన తరువాత 1918 సం॥రం జూన్ 15 తేది మొదలు 1902 సం॥ జూన్ 15 వ తేదివరకు ప్రతి సం॥రం జూన్ 15 తేది నాటికి యావత్తు ఫాయిదాయున్ను యివ్వగలవారము. ఆలాగున యే వాయిదాయివ్వక పోయినా అప్పటికి నిల్చివున్న మొత్తమునున్ను వడ్డికున్నుకూడా నె 1 కి నూటికి రు 1—0—0 చొ॥న యియ్యర్లి కాంపౌండు వడ్డితో యియ్యగలవాడను. వసూలుయిచ్చిన సొమ్ము యీపత్రము వెనుకకు చెల్లు వ్రాయించుట తప్ప యితర దృష్టాంతము మంజూరుకాయ నిమిత్తము లేదు.

యే రెండువాయిదాలు వరుసగా గతించినను అప్పటికి నిలిచివున్న మొత్తముకు నెల 1 కి నూటికి రు 1—4—0 చొ॥న వడ్డీతో మావల్లను మాతాలూకును యితరాస్తివల్ల రాబట్టుకో వలయును.

ఈతనఖా ఆస్తి యిదివరలో యెవరును యేవిధమయిన తనఖా హామి, భాగ, భరణ వగయిరా హక్కులు లేవనిన్ని యిదియే మొదట తనఖా అనిన్ని మిమ్ము పూర్తిగా నమ్మించి మీవద్ద పయిన వుదహరించిన సొమ్ము పుచ్చుకుని ఈ మొదట తనఖాగా మీకు వ్రాసి మా ఆస్తి మాస్వాధీనమందె యుంచుకున్నాము.

## తనఖా ఆస్తి వివరము.

గోదావరి డి॥ రంగాపురం సబుడి॥

అయినపర్రు గ్రామము తాలూకా జిరాయితిపల్లం డివిజన్ సర్వే నం 212 6—0

—

1

213 8—0

—

1

పదునాలుగు యకరములు భూమియు యిందలి ఫలవృక్షము లును సహా మీకు అస్వాధీనపు తనఖా యివ్వడమయినది.

ఈవరా వ్రాసినను వ్రాయకపోయినను పత్రము పుట్టిన తేదీ లగాయతునుంచి ప్రతివాయిదా గతించిన ఆరుసంవత్సరములలోపలను దావాచేసేటట్లయితె యితరాస్తులమీదకు వెళ్ళుటకు హక్కుగలదు.

ఇది మాసమ్మతిని వ్రాయించియిచ్చిన అస్వాధీనపుతనఖా.

పప్పు నరసింహమువ్రాలు.

పప్పు బుచ్చివెంకయ్యవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. సింగినాదం జీవరత్నము సా॥ వ్రాలు.

2. చేదాడుల చెంచయ్య సా॥ వ్రాలు.

దస్తూరి—మలయివరపు సత్యనారాయణరావు, సా॥ పరాంకుశపురం.

—

# నెం ౪౯

**ది 25-9-1924 సం॥ యిరువదిఅయిదవ తేదీ సెప్టెంబరు పందొమ్మిదివందల యిరువదినాల్గవ సంవత్సరము. రు 1000 వేయిరూపాయలకు.**

**రాజమండ్రి కాపురస్థులు వ్యవసాయదార్లు రెడ్డి అచ్చన్న కుమారుళ్ళు బుచ్చియ్య 2 సరయ్య, 3 లచ్చన్న 1,2 మైనరులయినందున అన్న బుచ్చన్న సంరక్షకుడు గారికి**

రాజమండ్రి కాపురస్థులు వ్యవహారకర్త కోమట్లు సుబ్బుల సూరిశెట్టి కుమారుడు సుందరం వ్రాసియిచ్చినది.

నాకుటుంబ అవసరము నిమిత్తము యిదివరలో లోకులవద్ద చేసిన ఋణములు తీర్చుకొనే నిమిత్తము ఈరోజున మీవద్ద బదులు పుచ్చుకున్నవి రు 10000 లు పదివందలు రూపాయలకు యింతటి నుండి సొమ్ము ముట్టేవరకు నె1కి నూటికి రు 1-0 0రూపాయి చొ॥న వడ్డీతో ఈదిగువ నుదహరించిన వాయిదాలు ప్రకారము యేర్పాటు చేసుకున్నాము.

1925 సం॥రం మార్చి నెల 25 తేదినాటికి అయిన రు500లున్నూ అందునకయిన వడ్డీయున్ను,

1926 సం॥ మార్చి నెల 25 తేదినాటికి అయిన రు 250 లున్ను అందలి వడ్డీయున్ను,

1927 సం॥రం మార్చి నెల 25 తేదీనాటికి అయిన రు250లున్ను అందలివడ్డీయున్ను,

ఈప్రకారము పత్రముపీదాకు వసూలుంచుచ్చి వసూలయిచ్చిన సొమ్ము పత్రములపై చెల్లువ్రాయిస్తూ చెల్లుకుదర్శనముగా రశీదు కూడ పుచ్చుకొందును. అలాగున చెల్లు లేని రశీదులు యేవిధమైన యితర దృష్టాంతరములు మంజూరు చేయు నిమిత్తము లేదు. అలా యేవా

యిదాసొమ్ము వసూలుయివ్వక పోయినను రాగలవాయిదాలతో నిమిత్తములేకుండగా పత్రము బాకీ యావత్తు ఒక్కమారుగా రాబట్టుకొనుటకు మీకు అధికారము యివ్వడమైనది. ఈతనఖాఆస్తి ఇదివరలో యెవరికి యేవిధమైన హక్కు కలుగజేసియుండలేదనిన్ని ఇదియే మొదటితనఖాయనిన్ని మిమ్మును నమ్మించి ఈఅస్వాధీనపు తనఖా యిచ్చి ఆస్తి మాస్వాధీనములోనే యుంచుకున్నాము.

తనఖా ఆస్తి వివరము.

చింతలపూడి సబుడి॥ దుగ్గుదుర్రి గ్రామం తా॥ జిరాయితీ పల్లం డివిజన్ సర్వే నెం 879/3 లో య 14-92 సెంట్లున్ను ఇందలి ఫలవృక్షములు సహితము అస్వాధీనపు తనఖా యివ్వడమైనది.

సుబ్బుల సుందరం వ్రాలు.

సాక్షులు.

1. శికవట్ల చింతయ్య సాక్షివ్రాలు.
2. గోనుల గోపాలయ్య సాక్షివ్రాలు.

దస్తూరీ--వెంకటేశ్వర్లు వేణునాధం సా॥ రాజమండ్రి.

షరా:—రాగలవాయిదాతో నిమిత్తము లేకుండా అన్నిమరతులు వున్నప్పుడు యేవాయిదాకు ఆవాయిదాకు 3 మూడు సంవత్సరములలోపున దావాచేయవలయును. లేనియెడల కాలదోషము ఒకానొకప్పుడు కలుగవచ్చును. జాగ్రత్తగా గమనించవలయును.

## నెం ౫ రు

ది 18-9-1929 సం॥ పద్దెనిమిదవ తేదీ సెప్టెంబరు పందొమ్మిదివందల యిరవై తొమ్మిదవ సంవత్సరము.

రాజమండ్రి ఆలకట్టు తోట కాపురస్థులు బత్తుల రామయ్య ఈ రమణయ్య మైనరయినందున రామయ్య సంరక్షకుడు వ్రాసి యిచ్చినది.

రాజమండ్రి కాపురస్థులు గొల్లలు వ్యవసాయదారులు అంకం సత్తి రాజుకు.

మాకుటుంబము సమిష్టికుటుంబము. మాసమిష్టికుటుంబము నకు యజమాని మాలో 1 రామయ్య అయియున్నాడు.

మాకుటుంబఖర్చులనిమిత్తము అనగా మాలో 2 రమణయ్య వివాహమునిమిత్తము ఈరోజున మీవద్ద బదులుపుచ్చుకున్నవి రు1000 అక్షరాల పదివందల రూపాయలుకు యీతటినుంచి సొమ్ము ముట్టే వరకు నె 1 కి నూ 1 కి రు 0-13-4 లు చొ॥ పదమూడణాల నాల్గు పైసలు చొ॥ ఈదిగువ నుదహరించిన ఫాయిదాల ప్రకారము యివ్వ నిర్ణయము.

1919 సం॥రం సెప్టెంబరు 9 తేదినాటికి అసలు 200-0-0 లున్ను అందలి ఫాయిదాయున్ను.

1919 సం॥ ఆగష్టు 15 తేదినాటికి అయిన రు 200-0-0 లున్ను అందలి ఫాయిదాయున్ను.

1920 సం॥ సెప్టెంబరు 20 తేదినాటికి అయిన రు 200-0-0 లున్ను అందలి ఫాయిదాయున్ను.

1921 సెప్టెంబరు 20 తేదినాటికి అయిన రు 200 లున్ను అందలి ఫాయిదాయున్ను.

1922 సెప్టెంబరు 20 తేదీనాటికి అయిన రు 200 లున్ను అందలిఫాయిదాయున్ను యిచ్చుచూ యిచ్చినసొమ్ము ఈపత్రము వెనుక పీఠిని చెల్లువ్రాయిస్తును. అలా చెల్లులేని ఇతర దృష్టాంతరములు మంజూరు చేయునిమిత్తము లేదు.

పైన వుదహరించిన వాయిదాల ప్రకారము యే వాయిదా సొమ్ము వసూలు ఇవ్వకపోయినను అప్పటికి నిలిచివున్న ఫాయిదా కూడా అసలులో జేర్చుకుని అట్టిమొత్తమునకు నె 1 కి నూ 1 కి రు 1-0-0 రూపాయి గో॥ వడ్డీతో పత్రము బాకీ యావత్తుతీరేవరకు ఇవ్వగలవారము. పైన వుదహరించిన వాయిదాల ప్రకారముగాక రు 100 లు మించిన మొత్తముగాని పత్రము బాకీ యావత్తు మరతుల లోపల యెప్పుడు యిచ్చినను పుచ్చుకునే నిర్ణయము. తనఖాఆస్తి ఇదివరలో యెవరికి తనఖాలు లేవని మిమ్ము నమ్మించి ఈ తనఖా ఇవ్వడమైనది.

గోదావరి సబుడి॥ యేాలగొల్లు గ్రామం తాలూకు ఈనాం పల్లం సర్వే నెం 3079/13 లో యీ 20-80 సెంట్లు భూమిన్ని ఇందలి ఫలవృక్షములు సహితము మీకు అస్వాధీనపు తనఖాయిచ్చి ఆస్తి నాస్వాధీనములో వుంచుకున్నాను.

2. బత్తుల రామయ్య మైనరయినందున అన్న 1 రామయ్య సంరక్షకుడు వ్రాలు.

సాక్షులు.

1. పెంటా వెంకన్న సాక్షి వ్రాలు.

2. జక్కు తాతబ్బాయి సాక్షి వ్రాలు.

దస్తూరీ:-బత్తుల రామయ్య సా॥ రాజమండ్రి.

# నెం ౬ ౮

## రు 2000 లు అస్వాధీనపు తనఖాదస్తావేజు.

ది 4-10-1898 దిని నాల్గవ అక్టోబరు పద్దెనిమిది వందల తొంభైయెనిమిదవ సంవత్సరము,

నేలటూరు కాపరస్తులు తెలుగాలు వ్యవసాయం పోదూరి వెంకన్న నాయుడు గారికుమారుడు బుచ్చెయ్య గారికి.

నేలటూరు కాపరస్తులు తెలగాలు వ్యవసాయం నిట్టల వెంకట్రావు గారి కుమారుడు సత్యనారాయణ రావుగారున్ను 2 వెంకటరావు, 3 రంగారావు 4 బుచ్చి తమ్మారావు, 2, 3, 4, మైనర్లు అయినందున తండ్రి సంరక్షకుడు కుటుంబ యాజమాని సత్యనారాయణ రావు.

మాకుటుంబ అవసరం నిమిత్తం అనగా యిదివరలో నా కుమార్తె వెంకటరమణమ్మ వివాహనిమిత్తం కంభంపాటి రామారావు గారివద్ద చేసిన ఋణములు తీర్చేనిమిత్తమున్ను నాపెద్ద కుమారుడు విద్యాభివృద్ధినిమిత్తమును వ్యవసాయం పెట్టుబడినిమిత్తమున్ను యితరులవద్ద చేసినఋణములు తీర్చేనిమిత్తం నీవద్ద బదులు పుచ్చుకున్నవి రు 2000 లు రెండువేలరూపాయలకు నె॥ కి నూటికి రు 0—12—0 పండ్రెండుఅణాలుచొప్పున వడ్డితో ఈదిగువ నుదహరించిన వాయిదాలప్రకారం యివ్వగలవారము. 1899 సం॥రం ఫిబ్రవరి 15 తేదీనాటికి మొత్తముకు అయినవడ్డియున్ను అసలుతో రు 500 లున్ను

1900 సం॥రం ఫిబ్రవరి 15 తేదీనాటికి మొత్తమునకు అయిన వడ్డిన్ని అసలులో రు 500 లున్ను

1901 సం॥రం ఫిబ్రవరి 15 తేదీనాటికి మొత్తమున కైన వడ్డిన్ని ఆసం॥రములో రు 500 లును

1902 సం॥రం ఫిబ్రవరి 15 తేదీనాటికి మొత్తమున కైన వడ్డిన్ని అసలుతో రు 500 లున్ను సమయిదాల ప్రకారం సొమ్ముపూర్తిగా యిచ్చివేసి యిచ్చినసొమ్ము యీపత్రంపీఠిని చెల్లువ్రాయించుట తప్ప వేరే యితరదృష్టాంతరములు మంజూరుచేయ నిమిత్తంలేదు. పైన ఉదాహరించిన వాయిదాలప్రకారం ఏవాయిదాసొమ్ము యివ్వక పోయినా అప్పటికినిలిచియున్న అసలుపాయిదాల మొత్తము అసలుగా భావించి ఆ మొత్తమునకు నె1కి నూటికి రు 1—4—0 వకరూపాయ నాల్గుఅణాలుచొప్పున వడ్డితో ఈతనఖా ఆస్తివల్లను నాతాలూకు యితరఆస్తివల్లను మీాయిష్టంవచ్చినప్పుడు రాబట్టుకోవలెను. ఈతనఖా ఆస్తి యిదివరలో యేవిధమయిన ఋణములకు తనఖాలుగాని హామీాలుగాని యిచ్చియుండలేదనిన్ని యిదే మొదటితనఖాగా మిమ్ము నమ్మించియిచ్చినాననిన్ని సర్వేనెంబర్లు భూమిపరిమితము సరియైనవనిన్ని నమ్మించి ఈఆస్తి మీాకు అస్వాధీనపుతనఖా వుంచుకున్నాము. ఈ బాకీ తీరేపర్యంతము ముందు యెవరికీ తనఖాలు యివ్వగలవారము కాము. ఈతనఖా ప్రతిఫలంలోనుంచి పైన వుదహరించిన బాకీలు తీర్చి వారివల్లనుంచి ఆకాగితములు పుచ్చుకుని మీాకు నిదర్శనముగా యివ్వగా మిగిలినసొమ్ము పూర్తిగా పుచ్చుకుని ముట్టినందుకు అలా యిదిగా రశీదున్ను మీాకు యివ్వగలవారము తనఖాఆస్తివివరం. గోదావరిజిల్లా గాదరాడ సబుడివిజన్ కొండ్రేగుల గ్రామంతాలూకు ఈనాం పల్లం రివిజన్ సర్వేనె 363 రు య 29-70 ట్లు యిరవయి తొమ్మిదియకరముల డెబ్బైశెంట్లున్ను ఇందుల ఫలవృక్షముల సహితం మీాకు అస్వాధీనపు తనఖాయిచ్చినాము.

1. వ్రాలు.

2 3 4 మైనర్లయినందున యజమాని నిట్టల సత్యనారాయణ వ్రాలు.
యిందుకు సాక్షులు.—అవధానుల సుబ్బిశెట్టి సాక్షి వ్రాలు.

2. దుర్గా వెంకటస్వామి సా॥ వ్రాలు.

దస్తూరి—బత్తుల రమణయ్య, రాజమంద్రి.

షరా—వడ్డీలోవున్న పీనల్ కండిషన్ కోర్టులలో చెల్లుట సందేహాస్పదము గాన కాంపౌండు ఇంట్రెస్టుతో పత్రం వ్రాసుకొనుటయే చాలా మంచిది.

## ఖరారుతోకూడిన క్రియము.
## లేక తనఖా క్రియము.

ది 8—2—1920 సం॥ రము.

| రాజమంద్రి నరసింహా రావుపేట కాపురస్తులు వైశ్యులు బత్తుల రమణయ్యకు. | రాజమంద్రి కాపురస్తులు పెంటా వెంకన్న వ్రాయించియిచ్చినది. |
|---|---|

ఈదిగువ నుదహరించినటువంటివి మీకుయాభై రూపాయలుకు క్రియపరచినాను. క్రియధనము యావత్తు సబురిజిష్ట్రారుగారి యెదుట పుచ్చుకున్నాను. సదరు భూమి యింతటినుంచి సర్కారు పన్నులు చెల్లించుకుంటూ దానవిక్రయ సంపూర్ణాధికారములతో మీపుత్రపౌత్రపారంపర్యాయము సుఖాన అనుభవించవలయును. యీక్రియ ధనము ఒక సం॥ రములోపల అనగా 8—2—1921 సం॥రము లోపల మీకు యిచ్చినయెడల యీభూమిన్ని యీ దస్తావేజున్ను నాస్వాధీనము శాయవలసినది. ఆలాగున యివ్వనియెడల మీ పేర లెఖ్ఖలలో నమోజు చేయింతును.

కృష్ణా డి॥ నందిపాడు సబుడి॥ నందిపాడు గ్రామంతాలూకు జిరాయితీ మెరక డివిజన్ సర్వే నెం 168 సి రు య 1—0 ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన ఖరారుతో కూడిన క్రియదస్తావేజు లేక తనఖా క్రియదస్తావేజు.

పెంటా వెంకన్న వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. గోనుగుంట్ల గోపాలయ్య, సా॥ వ్రాలు.
2. చేబియ్యం చెంచయ్య, సా॥ వ్రాలు.

దస్తూరి—గోపాలం గోవిందయ్య, సా॥ రాజవరము.

తెలిసికొనుటకు మాత్రమే దస్తావేజులో వ్రాయనక్కరలేదు. ఈప్రకారము వ్రాసిన దస్తావేజులో యీషరతులలోపల సొమ్ముయివ్వనియెడల షరతు దాటిన తరువాత సొమ్ము యిచ్చినయెడల పార్టి పుచ్చుకొకపోతే క్రియము ఆమలు జరుగునుగాని జరుగకపోదు.

## ధనద్విగుణితపు దస్తావేజు

15—5—1928 సం॥ రం. 1000 పదివందల రూపాయలకు.

విశాఖపట్నం కాపురస్థులు బత్తుల రామయ్య కుమార్డు రామయ్యకు విజయనగరము కాపురస్థులు వైశ్యులు దుర్గా లచ్చన్నగారి పెద్దకుమారుడు వెంకట రమణయ్య వ్రాయించియిచ్చినది.

నాఅవసరంనిమిత్తముయీరోజున మీవద్దబదులుపుచ్చుకున్నవి రు 1000 లు పదివందలరూపాయలకు ధనద్విగుణము ప్రాప్తికిఅయిన మొత్తము రు 2000 లుకు ఈదిగువ నుదహరించిన ఆస్తిని 15 సం॥ రములు మీ స్వాధీనమందుంచుకుని మీయిష్టమువచ్చిన వ్యవసాయముచేసుకుని 16 వ సం॥రమందు స్వాధీనపరచవలసినది. ఈపదిహేను సంవత్సరములు సర్కారుపన్నులు యావత్తు మీరు చెల్లించుకోవలయును. ఈసొమ్ముకువడ్డీ యెంతమాత్రమునులేదు. ఈషరతులోపల 3 సంవత్సరములు దాటినతరువాత నేను సొమ్ము యిచ్చేయెడల అదివరకు మీకు భుక్తమైన సం॥ రములుకు 1 కి రు 110 లు చొ॥

న శిస్తుజరిగిన సం॥రముకు లెఖచూచుకొని సొమ్ము పత్రములో చెల్లు చూచుకొని మిగిలినసొమ్ము నావల్లపుచ్చుకొని నాకు పత్రమున్ను, ఈభూమిన్ని నాస్వాధీనము చేయవలసినది. అలాపుచ్చుకొనక మీరు నిరాకరించినయెడల నాకువచ్చే నష్టము మీరు యివ్వవలసియున్నది.

తనఖా ఆస్తి వివరము.

ఈమరతును వ్రాస్తూ ఈమరతులోపల నేను సొమ్ము యిచ్చుటకు సిద్ధముగాయున్నాను. భూమి వదలివేయుమని నేను కోరువాడను కాను. ఏకారణముచేతనయినను ఈమరతులోపల ఈభూమి మాస్వాధీనమునుండిగాని క్రమమయిన అధికారులద్వారా తప్పిపోయినయెడల తప్పిపోయిన వెంటనే నాతాలూకు పలానాగ్రామములోని నెం43రు భూమి యు 4—8 శెంట్లభూమి మీరు స్వాధీనపర్చుకుని మరతు పర్యంతము అనుభవించవలసినది. దుర్గా వెంకటరమణయ్య వ్రాలు.

సాక్షులు.

1. యంపాడ అప్పలస్వామి సాక్షివ్రాలు, రాజమండ్రి.

2. శివ్వా పోతురాజు సాక్షివ్రాలు.

దస్తూరి—బత్తుల రమణయ్య, రాజమండ్రి.

## శ్రీ రాసపుకవులు.

తా 28—8—1928 సం॥రం.

రు 1000 రూపాయలుకు.

| రాజమండ్రి గ్రామం కాపరస్తులు నడిపల్లి సోమన్న గారికి: | మజుకూరి గ్రామం కాపరస్తుడు ముంగర బాగయ్య వ్రాసి యిచ్చినది. |
|---|---|

ఇదివరలో మీవద్ద బదులుపుచ్చుకొన్న బాపతు మీరు రుజువులు లెక్కచూచుకోగా యివ్వతెలిన బాకి ఈకోజాకు అయిన

అసలుఫాయిదాలు రు 960 లున్ను తొమ్మిదివందల అరువది రూపాయలున్ను ఈదస్తావేజు రిజస్టరుఖర్చులు వగైరా క్రింద ఈరోజున బదులుపుచ్చుకొన్నవి రు 40 నలుబది రూపాయలున్ను వెరశి 1000 పదివందలరూపాయలుకు వడ్డి యివ్వనక్కరలేకుండా ఈదిగువ నుదహరించినటువంటి భూమిని శుక్లనామసం॥రం లగాయతు ధాతసం॥రం పంట ఆఖరువరకు 8 సంవత్సరములు మీాయిష్టమువచ్చిన వ్యవసాయముచేసుకుంటూ సర్కారుపన్నులు చెల్లించుకుంటూ మరతాఖరు సంవత్సరమున అనగా ధాతసంవత్సర ఫాల్గుణ బహుళ అమావాస్య నాటికి నాభూమిన్ని ఈదస్తావేజున్ను నాఆధీనముచేయవలసినది. మరతులోపల ఇందలి ఫలవృక్షములుయొక్క ఫలము అనుభవించవలసినదేగాని, మొదళ్ళుగాని కొమ్మలుగాని కొట్టకూడదు. గోదావరిడి॥ కాం క్రేడేగుల సబుడి భీమనపల్లిగ్రామం తాలూకు జిరాయితి మెరకపల్లం నెం 133/9 య 18-23 పద్దెనిమిది యకరముల ఇరవైమూడు శెంట్ల భూమి తీర్మానపుకవులు ఇవ్వడమైనది. ఇది నాసమ్మతిని వ్రాయించి యిచ్చిన తీర్మానపు కవులు.

ముంగరి బాగయ్య వ్రాలు.

సాక్షులు.

1. బత్తుల రమణయ్య సాక్షివ్రాలు.
2. గుత్తు గురయ్య సాక్షివ్రాలు.

దస్తూరీ—పెంటా వెంకన్న, రాజమండ్రి.

మరా:-క్రియమువలెనే స్టాంపు నూటికి 1-8-0 చొ॥ స్టాంపు.

# వడ్డీతీర్మానపు పత్రము.

1—7—1719 సం॥ రు 1500 లకు పదిహేనువందలరూపాయలకు

| రాజమండ్రి కాపరస్తులు బత్తుల రామయ్యగారి రెండవ కుమారుడు రమణయ్యకు. | మజ్కూరు కాపరస్తులు రెడ్లు వ్యవసాయం యాపాడపైడయ్య కుమార్డు అప్పలస్వామి వ్రాయించినది. |
| --- | --- |

మాకుటుంబ ఋణములు తీర్చుకునే నిమిత్తము ఈరోజున మీవద్ద బదులుపుచ్చుకున్నవి రు 1500 ల్కు యింతటినుంచి వడ్డీయియ్యనక్కరలేకుండా యీదిగువ నుదహరించినటువంటి భూమిని ఈరోజున మీస్వాధీనము చేసితిని గనుక మీచిత్తవృత్తి ప్రకారము వ్యవసాయము చేసుకుని భుక్తపర్చుకొనవలయును. అలాగున పది సం॥రములు మీరు వడ్డీక్రింద అనుభవించినమీదట మేముయెప్పుడు అసలు 1500 లు మీకు వసూలుయిచ్చితే అప్పుడు ఈపత్రమున్ను, భూమిన్ని తిరిగి మాఆధీనము చేయవలసినది. ఆప్రకారము పది సం॥రములు దాటిన మీదట మేము వసూలు యిచ్చేయెడల ఆయాసం॥రము ఆమృగశిర కార్తిలోపలనే వసూలుయివ్వ నిర్ణయము. ఆలా మృగశిరకార్తి దాటినతరువాత వసూలుయిచ్చేయెడల మీరువసూలుపెట్టుకుని ఆసంవత్సరముకూడా మీరు భుక్తపరచుకుని వదలిలేసే నిర్ణయము. ఈమరతులోపల మీరు పెంచే వ్యవసాయములకు పనికివచ్చే తుమ్మ, నక్కిరి వగైరా మొక్కలేగాని మామిడివగైరా ఫలవృక్షములు మీరు కొట్టకూడదు. ఈభూమికి యిదివరకున్న నీటివసతులు పాడు చేయకూడదు. ఈభూమిలోనుంచి మరియొకరికి నీటివసతి హక్కు కలుగజేయకూడదు. ఈభూమి ఈరోజున కొలతవేసి మీకువప్పగించినాము గనుక తిరిగి కొలత్రప్రకారము మాకు వప్పగించవలయును.

రాజానగరం డి॥ రాతులపూడి సబుడి॥ రాతులపూడిగ్రామం తాలూకు ఈనాం పల్లం నెం 1189 య 3—0 లు.

ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన తీర్మానముకవులు పత్రము.

యంపాడ అప్పలస్వామి వ్రాలు.

యిందుకు సాక్షులు.

1. పిట్ట అప్పలరెడ్డి సాక్షి వ్రాలు.
2. మేకల శేషాద్రిరావు సాక్షి వ్రాలు.

దస్తూరి—సీమకుర్తి మల్లన్న, రాజమండ్రి.

షరా—నూటికి 1—8—0 చొ॥ రు 22—8—0 స్టాంపు

# మైనరున్న యెడల వ్రాయవలసిన విధము.

రు 400 లకు క్రియదస్తావేజు. స్టాంపు రు 6—0—0

ది 14—8—1928 తేదీని.

వేలంక గ్రామం కాపరస్తులు కమ్మ వారు వ్యవసాయదార్లు అనపర్తి వెంకన్న గారి కుమారుడు అచ్యుత రామయ్య గారికి—

వేలంక గ్రామం కాపరస్తులు కమ్మ వారు వ్యవసాయదార్లు రావూరి వెంకట్రామన్న గారి కుమార్తెలు బాపినీడు 2 ఈ బాపినీడుగారి కుమార్తెలు రామన్న 3 సోమన్న 4 లక్ష్మన్న 3, 4 మయినర్లయి నందున తండ్రి సంరక్షకుడు బాపినీడు వ్రాయించి యిచ్చినది.

మాలో లక్ష్మన్న వివాహము నిమిత్తము యిదివరలో లోకుల వద్దచేసిన రుణతీర్మానమునిమిత్తం ఈదిగువ నుదహరించి నటువంటి ఆస్తిని ఈరోజున మీకు రు 400 లకు క్రియపరచి క్రియధనము ఇది వరలో మాలో కుటుంబయాజమాని అయిన బాపినీడు అరిగిల

సూరయ్యగారి పేర వ్రాయించిన నోటుతాలూకు అసలుఫాయిదాలు రు 390 లు మూస్థానే మీరు వారికి వసూలుయిచ్చి ఆనోటుపైన చెల్లువ్రాసి మీవద్ద నిదర్శనముగా వుంచుకొనవలయును. మిగిలిన రు 10 లు ఈరోజున మాకు రొఖ్ఖముయిచ్చినందున క్రియధనము యావత్తు ముట్టినది. ఈభూమి యిపుడే మీఅధీనము కాయడమైనది. ఇంతటినుంచి స్థిరాస్థిపన్నులు చెల్లించుకుంటు దానవిక్రయాదిసమస్తాధి కారములుకలిగి మీవంశపారంపరియం సుఖాన అనుభవించ వల యును. ఇందునుగురించి పూర్వాదిదాసప్త్రతిజ్ఞ పరితిసామంతాద్యవ విరోధములు యేమివచ్చినా అవన్నియు పరిహరించి మీక్రియము నిరాటంకముగా సాగింతుము. ఈభూమిపయిని యితరులకు యెవరికి యేవిధమైనహక్కులు లేవనిన్ని న్యాయమయిన వినియోగనిమిత్త మున్ను కుటుంబ అవసరము నిమిత్తము కాయబడినదనిన్ని మిమ్ము నమ్మించి ఈక్రియము మీకు యివ్వడమయినది. వేలూరు డి॥ రాగం పేట సబుడి॥ వేలంకగ్రామముతాలూకు జిరాయతిపల్లం య 1—0 భూమి మీకు క్రియము యివ్వడమయినది.

2. రామన్నవ్రాలు. 3. సోమన్న 4 లత్సన్న మైనర్లయి

నందున తండ్రి సంరక్షకుడు బాపిసీడు వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. బత్తుల రామయ్య సా॥ వ్రాలు.

2. దుర్గా వెంకటస్వామి సా॥ వ్రాలు.

దస్తూరి—పప్పు అప్పలస్వామి, సా॥ రాజమండ్రి.

వరా—క్రియధనము మయినరులను బాధించునదే యుండవల యును. క్రియము చేయవలసిన అవసరము క్రియధనముయొక్క విని యోగము విచక్షణగా వుండవలయును.

# క్రియ దస్తావేజు.

స్టాంపు నూటికి రు 1—8—0 చొ॥ రు 2000 లకు రు 30 స్టాంపు.

| | |
|---|---|
| రంగాపురం కాపురస్తులు బ్రాహ్మణులు యీనాందారులు రామకేసరి వెంకట్రావు గారి కుమాళ్లు రామారావు గారికి— | రంగాపురం కాపురస్తులు బ్రాహ్మణులు ఇనాందారులు పెండ్యాల రంగారావుగారి కుమారుడు సుబ్బారావు వ్రాయించియిచ్చినది. |

కొల్లేరులో భూములు కొనుక్కునేనిమిత్తము యీదిగువ నుదహరించినటువంటి భూమిని ఈరోజున 2000 రెండువేల రూపాయలకు క్రియపరచి క్రియధనము సబురిజిస్ట్రారుగారియెదుట పుచ్చుకున్నాము. గనుక ముట్టినది. ఈభూమి యిప్పుడే మీఅధీనం కాయడమయినది. గనుక యింతటినుంచి సర్కారుపన్నులు చెల్లించుకుంటు మీయిష్టానుసారం దానవిక్రయాది సమస్తాధికారములు కలిగి మీపుత్రపౌత్రపారంపరియం సుఖాన అనుభవించవలయును. ఈక్రియము మీకు అమలుజరుగుటలో యేవిధమయిన తగాదాలువచ్చినా అవన్నియు నాస్వంతఖర్చులతో పరిహరించి మీక్రియను నిరాటంకముగా సాగింతును. ఈభూమి యిదివరలో యెవరికి తనఖాలు హామీ వగయిరాలుగాని భాగభరణవగయిరా హక్కులుగాని లేవనిన్ని నాకన్నయెక్కువ హక్కుదారులు యెవరు లేరనిన్ని నెంబరు పరిమితము సరి అయినది అనిన్ని మిమ్ము నమ్మించి ఈక్రియను మీకు యివ్వడమయినది. ఈభూమి లెఖ్ఖలలో నమోజు చేయించుటకు ఒడంబడికలు దాఖలు చేతును.

గోదావరి డి॥ గంగవరం సబుడి॥ రంగాపురంగ్రామంతాలూకు ఈనాం పల్లం నె 33/ఎ య 3—6

34—6

ఖి 48—18

ఈ నలుబదియెనిమిది యకరముల పద్దెనిమిది శెంట్ల భూమిన్ని మీాకు క్రియము యివ్వడమయినది.

పెండ్యాల సుబ్బారావు వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. దాసకవి రామచంద్రరావు సా॥ వ్రాలు.

2. సీతారామలక్ష్మణరావు సాక్షి వ్రాలు.

దస్తూరి—స్వహస్తము.

---

## సోదరులలో ౧ మేజరు ౧ మయినరువున్న యెడల

వ్రాయు విధము.

10—5—1927 పదియవ తేదీ మే నెల పందొమ్మిదివందల యిరువది యేడవ సంవత్సరము.

రు 800 లకు క్రియము.

విరవాడ కాపరస్తులు తెలగాలు వ్యవసాయదారులు సింతపెంట రామన్నగారి కుమాళ్లు లత్చన్న గారికి—

విరవాడ కాపరస్తులు తెలగాలు వ్యవసాయదారులు చీపురపల్లి చిన వెంకయ్యగారి కుమాళ్ళు వెంకటరామన్న 2 సూర్యనారాయణ మయినరయినందున సంరక్షకుడు సమిష్టిసోదరుడు వెంకట రామన్న వ్రాయించియిచ్చినది.

మాలో వెంకటరామన్న కుటుంబ యాజమాని అయి వ్యవహరించుచున్నాడు.

మాతండ్రిగారు పోయినతరువాత మాభూములు సరియైన మరామ్మతులేక భూములు చాలాపాడుపడినందున సదరు నేల మరమ్మతుచేయుట ముఖ్యావసరమయి యున్నందున ప్రస్తుతము డబ్బులేనందునను ఋణముచేసినట్లయితె వడ్డీలు వగయిరాలు విశేషముగా పెరుగునను భయముతో చిన్నిఅప్పుచేయుట యెంతమాత్రము లాభకరము గాదని యోచించి యీదిగువ నుదహరించినటువంటి నేలనుపయి అవసరమునిమిత్తము మీకు రు 800 లు- యెనిమిదివందల రూపాయలకు క్రియపరచి క్రియధనము సబురిజిస్ట్రారువారి యెదుట పుచ్చుకున్నాము గనుక యింతటినుంచి సర్కారుపన్నులు చెల్లించుకుంటూ దానవిక్రయసమస్తాధికారముకల్గి మీపుత్రపౌత్ర పారంపరియాయము తామనుభవించవలయును. ఈక్రియను మీకు అమలు జరుగుటలో యేవిధమయిన తగాయిదాలు వచ్చిన అవన్నియు స్వంత ఖర్చులతో పరిహారించి మీక్రియను నిరాటంకముగా సాగింతును. ఈనేలపయి యేవిధమయిన లావాదేవీలు లేవని మిమ్ముల నమ్మించి ఈక్రియను మీకు యివ్వడమయినది.

గోదావరి డి॥ రాజోలు సబుడి॥ విరసగ్రామంతాలూకు ఈనాం మెరక య 5—0 అయిదుయకరములు యిందలి ఫలవృక్షములుసహితము మీకు క్రియను యివ్వడమయినది. ఇది సమ్మతిని వ్రాయించి, యిచ్చిన క్రియదస్తావేజు, చీపురుపల్లి వెంకటరామన్న వ్రాలు

2. సూర్యనారాయణ మైనరయినందున సంరక్షకుడు.

ఇందుకు సాక్షులు.

1

2

దస్తూరి—అవధాని సుబ్బారావు.

# సెటిలుమెంటు దస్తావేజు.

15—12—1928 సంవత్సరము.

రు 1000 లు ఆస్తికి సెటిల్మెంటు దస్తావేజు.

| రాజమండ్రి నరసింహారావుపేట కాపరస్తులు చినబుచ్చమ్మకూతురు సూరమ్మకు— | మజ్కూరు గ్రామము కాపురస్తులు బుచ్చమ్మ వ్రాయించి యిచ్చినది. |
|---|---|

నీవు నాకు కుమార్తెవయియున్నావు నాఆస్తికి అనంతరకర్త నాకుమూరు దున్నట్టుటికి ఇది స్త్రీధనపు ఆస్తిఅగుటచేత నాయిష్టప్రకారము చేసుకొనుటకు నాకు హక్కు కలిగియున్నందువల్ల నీయందు నాకుయున్న ప్రేమయే ప్రతిఫలముగా యెంచి ఈదిగువ నుదహరించిన ఆస్తిని నీపుత్రపౌత్రపారంపరియాయము అనుభవించుటకుగాను యిచ్చివేయడమయినది. గనుక యింతటినుంచి సర్వవిధముల హక్కు కలిగి అనుభవించవలయును. యిందుకు యేవిధమయిన తగాయిదాలు వచ్చినా అవన్నియు పరిహరించి నీకు అమలు జరుపుదును.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన సెటిల్మెంటు దస్తావేజు.

గోదావరి డి॥ వీరవిల్లిపాలెం సబుడి॥ కోలంకగ్రామంతాలూకా జిరాయితి పల్లం నెం 385 యెం 1—55 ట్లు ఇందలిఫలవృక్షములసహా

గుడిమట్ల బుచ్చమ్మ నిశాని.

ఇందుకు సాక్షులు.

1. పిట్టా అప్పలరెడ్డి సాక్షివ్రాలు.
2. ఎంపాడ అప్పలస్వామి సాక్షివ్రాలు.

దస్తూరి—బత్తుల రమణయ్య సా॥ రాజమండ్రి.

నూటికి రు 0—12—0 చొ॥ రు 7—8—0 స్టాంపు.

# సెటిలుమెంటు దస్తావేజు.

ది 16—6—1618 సం॥రము.

రు 1000 లు పదివందలరూపాయలు కిమ్మతుచేయు

ఆస్తికి సెటిల్ మెంటు దస్తావేజు.

| వెంకన్నగారి కుమారుడు సుబ్బన్న గారికి— | యేసి రామన్న కుమారుడు చెల్లయ్య వ్రాయించి యిచ్చిన సెటిల్ మెంటు దస్తావేజు. |
|---|---|

నీవు నాకుమారునకు కుమారుడవై యున్నావు. నీతండ్రినేను సమిష్టికుటుంబముగానే యున్నాము. ఈదిగువ నుదహరించిన ఆస్తి అంతయు నాస్వార్జితపు ఆస్తియైయున్నది. నాఅనంతరము ఈఆస్తి నా కుమారునకు చెందవలసినదైయున్నను అతనియొక్క దుర్నడతను బట్టి ఈఆస్తి ఆతనికి చెందచేయుటకు వుద్దేశ్యము నాకు లేక నాకు సర్వ విధముల సంపూర్ణాధికారముగల ఈఆస్తి నీకు చెందచేయుటకు నిశ్చ యించి ఈదస్తావేజు వ్రాయించియిచ్చి ఈఆస్తి నీస్వాధీనము చేయుడ మయినది గనుక యింతటినుంచి సర్కారుపన్నులు చెల్లించుకుంటూ నీపుత్రపౌత్రపారంపర్యాయము సుఖాన అనుభవించవలసినదిగా ఈ ఆస్తికి సర్వవిధముల నీవేహక్కుదారుడవుగాని నాకుగాని నాకుమా రునకుగాని యేవిధమయిన హక్కునులేదు. ఈఆస్తిపైన నేనును నీతండ్రియును పోషింపబడవలసిన వారమగుటచే మాకుటుంబమును నీవు పోషింపవలసినది.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన సెటిల్ మెంటు దస్తావేజు.

గోదావరి డి॥ భీమడోలు సబు డి॥ భీమవరము గ్రామము తాలూకు ఈనాం పల్లం రీసర్వే నెం 173/బి రు య 14—50. ట్లు

185 రు య6—14ట్లు
బి
జిరాయితీ మెరక 175 రు య 23—14ట్లు
ఎ 33—78
యేసి చెల్లయ్యవ్రాలు.

సాక్షులు.

1. గొట్టుముక్కల గోవిందయ్య సాక్షివ్రాలు.
2. చేదారాల చెంచయ్యసాక్షివ్రాలు.

దస్తూరీ—మంగినపూడి మంగయ్య సా॥ రాజమండ్రి.
మరా—నూటికి రు 0—12—0చొ॥ నసే.

# దానపట్టా

రు 400లు కిమ్మత్తుచేయు ఆస్తికి దానపట్టానూటికి రు0-12-0 చొ॥న రు 3—0—0స్టాంపు

30—12—1928 సం॥రము

| రాజమండ్రి ఆలకట్టుతోట కాపురస్తులు మాదాలమ్మకు | రాజమండ్రికాపురస్తులు ఆ దెమ్మ వ్రాయించి యిచ్చినది. |
|---|---|

నీవు నాకుమాత్రవగుటచేతను నీకన్నముఖ్యవారసులు యెవరు లేనందువల్లను నాఅనంతరం ఆస్తిని నీజీవనోపాధికి దానవిక్రయాదది కారములుగలిగి నీపుత్రపౌత్రపారంపరియాయ మనుభవించవలయును యింతటినుంచి సర్కారుపన్నులు నీవు చెలించుకుంటూ యుండవలయును ఈభూమిపయిని యేవిధమయిన తగాదాలులేవు.

అనంతరం యీఆస్తినీకుచెందవలసినందున గోదావరి డి॥ ఆలమూరుసబుడి॥ వెంకటాయపాలెం గ్రామంతాలుకా1389 య3-2సెంట్లు

ఇదినాసమ్మతినివ్రాయించియిచ్చినదానపట్టా
మనబట్లఆదెమ్మనిశాని

యిందుకుసాక్షులు

1 భవిరిశెట్టి అప్పారావుసాక్షివ్రాలు.

2 మేకల శేషాద్రిరావువ్రాలు

దస్తూరి:—బత్తుల రామయ్య సా॥ రాజమండ్రి.

షరా:—ఈప్రకారము వ్రాసినట్టయితే సెటిల్మెంటుదస్తావేజుకు సరిపోవును.

నోట్కు రు 0—12—0లు చా॥ రు 3లు స్టాంపు ఆప్రకారము స్టాంపు ఆక్టులోకూడా వున్నది.

# సరెండరు దస్తావేజు లేక జీవితకాలపు హక్కుసంక్రమణపు దస్తావేజు

ది 17—9—1927 సం॥రము.

రు 1000 లు ఆస్తికి.

| ఆలమూరు గ్రామకాపరస్తులు బ్రాహ్మణులు యీనాందార్లు ఆరాధ్యుల వెంకయ్యగారి కుమారుడు బుచ్చిసుబ్బయ్యగార్కి | పీరంపాలెం కాపురస్తులు బ్రాహ్మణులు యీనాందార్లు రామలింగముగారిభార్య వెంకటరమణ వ్రాయించియిచ్చినది. |
|---|---|

నీవు నాకు పెదమామగారి కుమారుడవయియున్నావు. అనగా నీతండ్రిగారయిన రామలింగముగారున్ను నామామగారు అయిన వెంకన్నగారును యేకోదరసోదరులున్ను బుచ్చిసుబ్బయ్యగారి కుమాళ్లున్ను అయియున్నారు. నాకు నీకన్న యెక్కువ సన్నిహితవారసులు యెవరు లేరు. యీదిగువ నుదహరించునటువంటి ఆస్తినాభర్త తాలూకు ఆస్తిఅయియున్నది. సదరు యాస్తి యావత్తు యీరోజున

నీకుదానవిక్రయాద్యాధికారములతో అనుభవించుటకుగాను ఈఆస్తి యందు నాకుగల జీవితకాలపు హక్కు వదలుకొని ఈరోజున యిచ్చి వేయడమయినది. గనుక యింతటినుంచి సర్కారుపన్నులు చెల్లించు కుంటూ దానవిక్రయ సమస్తాధికారములుకలిగి అనుభవించవలయును. నాయావజ్జీవితము నీవు నన్ను పోషించవలయును. గంజాండిస్ట్రిక్టు ఆల మూరు సబుడి॥ అలమూరుగ్రామంతాలూకు జిరాయితి మెరక 1278 య 9—55 ట్లు. ఈతొమ్మిదియకరములు యాభై అయిదుశెంట్లు భూమితప్ప యింక యేవిధమయిన ఆస్తిలేదు. అ 673 630

డి 9 55

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన సరెండరు లేక జీవిత కాలపు హక్కు సంక్రమణపు దస్తావేజు.

ఆరాధ్యుల వెంకటరమణమ్మ వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. ధరణికోట దాసరయ్య సా॥ వ్రాలు.
2. దంతం దాలయ్య సా॥ వ్రాలు.

దస్తూరి—మానావంతుల మాణిక్యం, రాజమండ్రి.

# కవులు.

10—4—1918 సం॥రము రు 150 నూటయేబది రూపాయలు శిస్తుయిచ్చుటకు 5 సంవత్సరములకు కవులు.

| రాజమండ్రి ఆలకట్టు తోట కాపరస్తులు బత్తులరామయ్యగారి పెద్దకుమారుడు రామయ్యగారికి | రాజమండ్రి కాపరస్తులు కోమట్లు శివ్వా పురుషోత్తము గారి కుమారుడు శివ్వా పోతి రాజు వ్రాసియిచ్చినది. |
|---|---|

ఈదిగువ నుదహరించినటువంటిస్న్, మాపూర్వార్జితము బాప తునూ భూమికి సాలు 1కి 150 నూటయేబది రూపాయలిచ్చుటకు నిర్ణ

యించి విశ్వావసు సం॥రము లగాయతు సౌమ్యసం॥రము ఆఖరువరకు 5 సం॥రములకు వప్పుకుని మీారు కదపా వ్రాయించి యిచ్చినందున యీాకవులు వ్రాయించి యివ్వడమయినది. గనుక సదరు శిస్తుప్రతిసం వత్సరము పుష్య శు ౧౫ పౌర్ణమినాటికి ఒక్కమారుగా నాకునగదు యిచ్చి రశీదుపొందవలయును. ఈచేనులో ఫలించిన అయివేజు మీాశి స్తుయిచ్చి మీావల్ల శెంవుపొందనిదే తసరపుచేసుకొని పట్టుకొని వెళ్ళ గలవాడనుగాను. ఈచేనులోనే కుప్పలువేయనిర్ణయము. ప్రథమపంట పన్నులు యావత్తు నేనేయిచ్చుకొందును. రెండవపంటపన్నులు నీవు యిచ్చుకొనవలయును. పరతాఖరు సం॥రము దుక్కితో సంబంధిం చిన యేవిధమైన పైరువేయకుండా విడుదలతో నిమిత్తము లేకుండా నున్ను, సౌమ్యసం॥ ఫాల్గుణ బ 30 అమావాస్యనాటికి నాభూమి నాఅధీనము చేయవలసినది.

గోదావరి డి॥ వెంకటాపురం సబుడివిజను రీసర్వే నెం 455 జిరాయితీపల్లం య 3-0 లు.

ఇది నాసమ్మతిని వ్రాయించి యిచ్చిన కవులు.

శివ్వా పోతిరాజు వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. పుచ్చల వెంకటరత్నం సాక్షివ్రాలు. సా॥ రాజమండ్రి.

2. పుచ్చల వెంకటరాజు సాక్షివ్రాలు. రాజమండ్రి

దస్తూరీ—దుర్గా వెంకటస్వామి సా॥ కోరుకొండ.

షరా:—నూటికి రు 0—12—0 చొ॥ 1—8—0

# హామీపత్రము

19—11—1928 సం॥రము.

రు 100 లకు హామీపత్రము.

వేలంక గ్రామం కాపరస్తులు కమ్మవారు వ్యవసాయదార్లు అన పర్తి వెంకన్నగారికుమాళ్లు అచ్చుతరామయ్యగారికి—

వేలంకగ్రామ కాపరస్తులు కమ్మవారు వ్యవసాయదార్లు రావూరి వెంకటరామన్నగారి కుమాళ్ళు బాపినీడు, 2 యీ బాపినీడుగారి కుమాళ్ళు రామన్న 3 సోమన్న 4 లత్సన్న 3 4 మంది నర్లయినందున తండ్రి సంరక్షకుడు బాపినీడు వ్రాయించియిచ్చినది.

అరికిరేవల గ్రామములోని నెం 33 రు జిరాయితి పల్లపు భూమి రు రు 100 నూరురూపాయలకు మీకు క్రియపరచి చోడవరము సబురిజిష్ట్రారు ఆఫీసులో 1వ పుస్తకము 570 వాల్యుం 323 పుటలో నెం 433 రుగా రిజిష్టరీ చేయించి భూమి మీస్వాధీనము చేసినాను. సదరు భూమి యేకారణముచేతనైనా కోర్టుద్వారా తమస్వాధీనము తప్పిపోయినయెడల సదరు క్రియధనము రు100 లున్ను నూరురూపాయలున్ను అందుకు నె 1 కి నూటికి రు 1—0—0 రూపాయి చొ॥ వడ్డీతో స్వాధీనం తప్పిపోయిన తేదీలగాయతు సొమ్ము ముట్టేవరకు అయినవడ్డీతో ఈదిగువన వివరించిన ఆస్తి హామీపై రాబట్టుకొనవలసినది.

హామీ యిచ్చిన ఆస్తి వివరము.

గోదావరి డి॥ మంగళగిరి సబుడి॥ యేంద్రపాలెం గ్రామము తాలూకు జిరాయితీపల్లం రీసర్వే నెం 145 రు య 1—0,

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన హామీదస్తావేజు.
రావూరి బాపినీడు వ్రాలు.

3 4 మ॥ తండ్రి సంరక్షకుడు బాపినీడు వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. సీమకుర్తి కాశీలు వ్రాలు.
2. సీమకుర్తి వెంకట్రాజు వ్రాలు.

దస్తూరి—పెంటా వెంకన్న, సా॥ రాజమండ్రి.

షరా—నూటికి రు 0—12—0 చొ॥ ముప్పావలాయే.

## నెం ౨రు

17—4—1618 సం॥రము.

రు 200 లకు రెండువందలరూపాయలకు హామీపత్రము.

విశాఖపట్టణం డిస్ట్రిక్టుబోర్డువారి సముఖమునకు—

విశాఖపట్టణంజిల్లా అనకాపల్లి తాలూకా ఆముదాలవలస గ్రామకాపురస్థుడు కాపు వ్యవసాయము కోటంశెట్టి వెంకటస్వామి కుమారుడు రామస్వామి వ్రాయించియిచ్చినది.

మాగ్రామకాపురస్థుడు కాపు వ్యవసాయము కోటంశెట్టి వెంకటస్వామి కుమారుడు రామస్వామి అనే అతడు కోర్టులో ప్రాసెస్సరుగా పనిచేయుచున్నాడు గనుక అతనుకోర్టుద్వారా యిచ్చినసొమ్ముగాని కోర్టులో చెల్లించే నిమిత్తము వసూలయిన యేబాపతుసొమ్ముగాని సరియైన అమలుప్రకారము అమలుజరుపక హరించినను, దుర్వినియోగము చేసినను, దగాగా ప్రవర్తించినను, ఆమొత్తముక్రింద రు 200 లు రెండువందలరూపాయిలు కోర్టులో చెల్లించుటకు నేను జామీనుదారునిగానుండి యీజామీనుపత్రము వ్రాయించి దాఖలు చేయడమైనది. సదరు ప్రకారము సొమ్ము నేను చెల్లించవలసివచ్చే

యెడల కోర్టువారు నియమించిన కాలములో నేను చెల్లించక తప్పి పోయినయెడల ఆమొత్తమునకు యీదిగువ నుదహరించినటువంటిన్ని నీకప్పచీలయినటువంటిన్ని, నాస్వార్జితము బాపతున్నూ, నాఆస్తిని జామీనుగా యివ్వడమయినది.

కోటం శెట్టి వెంకటస్వామి వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. సప్పా సన్యాసి సా॥ వ్రాలు.
2. జేబుల సిద్ధయ్య సా॥ వ్రాలు.

దస్తూరి — ఇనుగంటి దామోదరయ్య.

షరా — నూటికి రూ 1—8—0 చొ॥ రు3—0—0 లు.

# విత్తంతువు వ్రాయు క్రియదస్తావేజు

రు 600 లకు క్రియదస్తావేజు నూటికి రు 1—8—0 చొ॥ 9 రూపాయిల స్టాంపు.

రాయవరం కాపరస్తులు గాజుల బలిజీలు గాజుల వర్తకము రామా మణి సూరయ్యగారి కుమారుడు నరసయ్యగారికి.

రాయవరం కాపరస్తులు శెట్టి బలిజీలు వ్యవసాయము మేడిశెట్టి వెంకటేశు భార్య అప్పలమ్మ వ్రాయించి యిచ్చినది.

నాకు ఈదిగువ నుదహరించినటువంటి భూమిన్ని కాపురముం డుటకు మాత్రము తగినయిల్లున్ను వున్నది నేను పెద్దదానను యే విధమయిన కూలిపని చేయుశక్తిలో లేను. నాజీవనోపాధి జరుగుటకు గాను యేవిధమయిన వుపాధిలేనందున యిదివరలో అచ్చటచ్చట సుమారు మూడువందల రూపాయలవరకు ఋణము జేసియున్నాను. ఆఋణము తీర్చుటకున్ను యిక మీదను జీవనోపాధి జరుగుటకున్ను గాను ఈదిగువ నుదహరించినటువంటి భూమిని ఈరోజున మీకు రు 600 లకు క్రియపరచి క్రియధనములోనుంచి మూడువందల రూపా

యలు యిదివరలో గంగుమళ్ల వెంకట్రామయ్యగారివద్ద నేను ప్రోనో టుమీద దఫాదఫాలను తెచ్చిన ఋణముతో వారిచేత మాన్పించు కున్నవిగా బాకీ సీదాకు వార్కిఇచ్చి వారివల్ల చెల్లువ్రాయించి పుచ్చుకొనవలయును మిగిలిన మూడువందల రూపాయలున్ను పుచ్చు కుని నాజీవితకాలము వరకు నన్ను పోషించుటకు నాసోదరుని కుమా రుడు గుత్తుల పెద్దరామయ్య నన్ను పోషించుటకు దస్తావేజువ్రాయించి యిచ్చినాడు గనుక అందుకు ప్రతిఫలముగా యిచ్చేనిమిత్తము మీవ ద్దపుచ్చుకున్నాను గనుక ముట్టినవి. ఈభూమి యిపుడె మీ అధీనము చేయడమయినది. గనుక యింటేటినుంచి సర్కారుపన్నులు చెల్లించు కుంటూ దానవిక్రయ సమస్తాధికారములు కలిగి మీపుత్రపౌత్రపారం పరియాయము సుఖాను అనుభవించవలయును ఈక్రియము మీకు అమలు జరుగుటలో యేవిధమయ్ను తగాయిదాలువచ్చినా అవన్నియు పరిహరించి మీక్రియము నిరాటంకముగా సాగింతును. ఈభూమి పయ్ను యేవిధమయ్ను తనఖావగయిరాలు వ్రాయించి యుండలేదని మిమ్ము నమ్మించి ఈక్రియము మీకు యివ్వడమయినది.

గోదావరి డి॥ నర్సాపురం సబు డి॥ రాయవరం గ్రామం తాలూకు జిరాయితి పల్లం నెం॥ 138 డి అ॥ 0—50 ట్లు యిదినా సమ్మతిని వ్రాయించి యిచ్చిన క్రియ దస్తావేజు.

మేడిశెట్టి అప్పలమ్మ నిశాని.

యిందుకు సాక్షులు.

1. యంపాడ అప్పలస్వామి సాక్షివ్రాలు.
2. పిట్ట అప్పాలరెడ్డి సాక్షివ్రాలు.

దస్తూరి—మాగాపు మంగయ్య సా॥ రాజమండ్రి.

# ముద్దత్తు క్రియము.

రు 400 లకు క్రియమువలెనే నూటికి రు 1-8-0 చొ॥న

రు 6-0-0 లు స్టాంపు.

ది 13-8-1928 సం॥రము.

రాజమండ్రి కాపరస్తులు కాపులు వర్తకంవల్ల జీవించె పల్లంటి సూరన్నగారి కుమారుడు వెంకటేశ్వర్లు గారికి-

మజుకూరి గ్రామం కాపరస్తులు పుప్పాల రామన్నగారి కుమార్డు రాములు వ్రాయించి యిచ్చిన ముద్దత్తు క్రియము

ఈదిగువ నుదహరించిన ఆస్తిని మీకు రు 400 లకు క్రియపరచి క్రియధనము ఈరోజున పుచ్చుకున్నాను. భూమి యిపుడే మీఅధీనము చాయడమయినది గనుక యింతటినుంచి సర్కారుపన్ను చెల్లించుకుంటూ దానవిక్రయసమస్తాధికారములతో మీపుత్రపౌత్రపారంపరియాయము సుఖాన అనుభవించవలసినది. ఈక్రియముమీకు అమలుజరుపుటలో యేవిధమయిన తగాయిదాలువచ్చినా అవన్నియు సొస్వంతఖర్చులతో పరిహరించి మీకిక్రియము నిరాటంకముగసాగింతును. ఈక్రియధనము నె1కి నూటికి రు 1—0—0 చొ॥న వడ్డీతో 2 సంవత్సరములులోగా మీకు వసూలుయిచ్చినయెడల ఈభూమిని ఈదస్తావేజును మాఅధీనము చాయవలసినది. గోదావరి డిష్ట్రిక్టు సబుడి॥ గోపాలపురం గ్రిముంతాలూకు ఈనాం పల్లం య 1—0. ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన ముద్దత్తుక్రియదస్తావేజు.

పుప్పాల రాములువ్రాలు.

ఇందుకుసాక్షులు

1. సికపట్ల చింతయ్యసాక్షి వ్రాలు.
2. గోనుల గోపాలస్వామిసాక్షివ్రాలు.

దస్తూరీ—మానేపల్లి సత్యం సా॥ రాజమండ్రి.

# స స్య క్రి య ము.

18-9-1819 సం॥రము.

రు 200 లుకు రెండువందలరూపాయలకు చెరుకుతోటసస్యక్రియము

విజయనగరము కాపురస్థులు కోమట్లు దుర్గా లచ్చన్న 2వ కుమారుడు వెంకటస్వామిగార్కి — రాజమండ్రి ఆలకట్టుతోట కాపురస్థులు బత్తులరామయ్యగారి పెద్ద కుమార్డు రామయ్యవ్రాసిఇచ్చినది.

నాతాలూకు ఈదిగువ నుదహరించినభూమిలో హాలుసాలున నేను వేసిన చెరుకుతోట వాసము సహితముగా మీకు రు 200 లు క్రియమునకు యిచ్చినాను గనుక క్రియధనము యీరోజున నే పుచ్చుకొని సస్యము మీస్వాధీనము చేయడమయినదిగనుక యింతటినుంచి యావత్తు మశాగత్తు మీరు చేసుకుంటూ తోటఆటకువచ్చిన వెంటనే కొట్టుకొని వెళ్ళిపోవలసినది. మీరు తోట పూర్తిగా పనికివచ్చేటట్టు కొట్టుకొని వెళ్లేవరకు కొట్టినభాగములలోవున్న కార్చితోటకు మొక్కలు పాడుగాకుండా జాగ్రత్తపెట్టుటకు నిర్ణయము.

గోదావరిడిస్ట్రిక్టు పెద్దాపురం సబుడిస్ట్రిక్టురంగాపురముగ్రామములో సర్వే నెం 175 య 0—58 ట్ల భూమిలోవున్న చెరుకుతోట మాత్రము క్రియమున కియ్యడమయినది.

ఇది నాసమ్మతిని వ్రాసియిచ్చిన సస్యక్రియదస్తావేజు.

బత్తుల రామయ్యవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. బోడపాటి బాబురావుసాక్షివ్రాలు.
2. వీణం చినవెంకటరావుసాక్షివ్రాలు.

దస్తూర్కి—స్వహస్తము.

షరా—నూటికి రు 1—8—0చొ॥న రు 200 లుకు రు 3-0-0లు.

# పరివర్తన దస్తావేజు

ది 11—5—1717. రు 1000 లు కిమ్మతుగల ఆస్తికి:
కూరెళ్ళ వెంకన్నగారు యీబుచ్చన్నగారు
ఉభయులు వ్రాసుకున్నది.

ఈదిగువ నుదహరించిన ఎ షెడ్యూలుఆస్తి మనలో వెంకన్న దిని బి షెడ్యూలు అస్తి బుచ్చన్నదిన్ని అయియున్నది. ఇప్పుడు వ్యవసాయ సౌకర్యముకొరకు యీఆస్తులనుపిరాయింపు జేసుకొనుటమంచిదని మనము ఉభయులము యోచించి వెంకన్న తాలూకుఏషెడ్యూలు ఆస్తిన్ని రు 100 లున్ను వందరూపాయలున్నుబుచ్చెన్న కిచ్చుటకున్ను అందుకు ప్రతిబద్ధాగా బుచ్చెన్నతాలూకు రు 1000 లు పదివందల రూపాయలకిమ్మత్తుచేయు బి షెడ్యూలు ఆస్తి వెంకన్నకుయిచ్చుటకున్ను ఒప్పుకొని యెవరికి రావలసిన ఆస్తులు వారు స్వాధీనము చేసుకుని యీదస్తావేజు వ్రాసుకుంటిమిగనుక యింతటినుంచి ఎషెడ్యూలు ఆస్తి బుచ్చెన్నయున్ను, బి షెడ్యూలు ఆస్తి వెంకన్నయునుపన్నులు చెల్లించుకుంటూ పుత్రపౌత్రపారంపర్యాయముగు సుఖాన అనుభవించవలసినది. ఈఆస్తులలో యెవరి ఆస్తికైనా వారు సరియైనఅధికారులు కారని న్యాయస్థానముతో న్యాయాధికారులవల్ల ధృవపరుపబడి స్వాధీనము తప్పిపోయినయెడల రెండవవారు వారు యిచ్చిన ఆస్తిని తిరిగి రాబట్టుకొనుటకు యిందుమూలముగా అధికారముగలదు. ఇది మావుభయుల సమ్మతిని వ్రాయించుకొన్న పరివర్తనదస్తావేజు.

| ఎ షెడ్యూలు. | బి. షెడ్యూలు. |
|---|---|
| గోపాలపురం రీసర్వే నెం 352 | తోరేడు గ్రామములో రీసర్వే |
| యం 5—5 ట్లు పల్లం. | నెం 375రు య 4—5ట్లు పల్లం. |

కూరెళ్ళ వెంకన్నవ్రాలు.
కూరెళ్ళ బుచ్చన్నవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. శివ్వా కామరాజుసాక్షి వ్రాలు.

2. బత్తుల రామయ్య సాక్షి వ్రాలు.

దస్తూరీ—దుర్గా వెంకటరమణయ్య, రాజమండ్రి

## డిక్రీట్రాన్సుఫరు

రు 200 లు రెండువందలరూపాయలకు డిక్రీట్రాన్సుఫరు.

రాజమండ్రి కాపురస్తులు బత్తుల రామయ్య పెద్దకుమారుడు రామయ్యకు - || విజయనగరము కాపురస్తులు దుర్గా లచ్చన్నగారికుమారుడు వెంకటస్వామి వ్రాయించియిచ్చినది.

నేను పెద్దాపురం డిస్ట్రిక్టుమునసఫ్ కోర్టులో అసలు 323 రున రామమణుగుల సుబ్బయ్యపైన పొందిన డిక్రీని అసలీఫాయిదాలసహితము రాబట్టుకొనుటకుగాను మీవల్ల రు 200 రెండువందలరూపాయలు ప్రతిఫలము పుచ్చుకొని డిక్రీట్రాన్సుఫరుచేసి యీదస్తావేజు వ్రాసియిచ్చినాను. గనుక సదరు డిక్రీలో నాస్థానే మీరు వాదిగా చేరి యావత్తు వారంటుగ్రంథము అమలుజరుపుకొనవలెను. సదరు డిక్రీ అమలుజరుపుకొనుటలో లాభనష్టములు మీరే భరించవలెను. గాని నాకేమియు సంబంధములేదు. పైన వుదహరించిన డిక్రీమీకిచ్చి వేయడమయినది.

ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన డిక్రీట్రాన్సుఫరుదస్తావేజు.

దుర్గా వెంకటస్వామివ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. శివ్వా పోతిరాజు సాక్షి వ్రాలు.

2. దుర్గా వెంకటరమణయ్య సా॥ వ్రాలు.

దస్తూరీ—బత్తుల రామయ్య, రాజమండ్రి.

# మనువృత్తి యిచ్చే పద్ధతిని క్రియము.

ది 13-8-1928 సం॥రము సాలీనా రు 50లు యేబదిరూపా యలు మనువృత్తియిచ్చు పద్ధతిని రు 1000లు పదివందలరూపా యలకు క్రియము.

| రాజమండ్రి ఆలకట్టుతోట కాపరస్తులు వైశ్యులు బత్తుల రామయ్య 2 వ కుమారుడు రమణయ్యగార్కి | రాజమండ్రి ఆలకట్టుతోట కాపురస్తులు రెడ్లు పిట్ట అప్పల రెడ్డి వ్రాయించియిచ్చినది. |
|---|---|

ఈదిగువ నుదహారించినటువంటి భూమిని నాకుటుంబ ఖర్చుల నిమిత్తం చేసినఋణములు తీర్చుకొనుటకుగాను ఈరోజున మీకు రు 1000 లు పదివందలరూపాయలకు క్రియపరచి యీధనము సబురిజి స్ట్రారువారియెదుట నగదుగా పుచ్చుకున్నాము గనుక ముట్టినది. ఈ భూమి యిప్పుడే మీయాధీనము చేయడమయినదిగనుక యింతటినుంచి సర్కారుపన్నులు చెల్లించుకుంటూ దానవిక్రయాదిసమస్తాధికారములు గలిగి మీపుత్రపౌత్రపారంపర్యాయము సుఖాన అనుభవించవలసినది. ఈక్రియము మీకు అమలు జరుగుటలో యేవిధమైన తగాయిదాలు వచ్చినా అవన్నియు, నాస్వంతఖర్చులతో పరిహారించి మీక్రియము నిరాటంకముగా సాగింతును.

ఈభూమిపైన మాపినతల్లియైన అనపర్తి వెంకమ్మకు కోర్టు డిక్రీప్రకారము సాలీనా యివ్వవలసిన రు 50 యేబదిరూపాయలు యీమె యావజ్జీవము యీమెకు మీరు యిచ్చి ఆమెవల్ల రశీదు పొందుతూయుండవలయును. సదరు మనువృత్తిడిక్రీలోవున్న హామీ తప్ప యేవిధమైన బాధ్యతలు లేవని మిమ్ములనమ్మించి యీక్రియము మీకు యివ్వడమయినది.

గోదావరి డి॥ అచ్యుతాపురం సబుడి॥ ఈలగొల్లు గ్రామములో యున్న జిరాయితీపల్లం నెం 373 య 1—50 ట్లు.

ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన క్రియదస్తావేజు.

పిట్ట అప్పలరెడ్డివ్రాలు.

సాక్షులు.

1. పెంటా వెంకన్నసాక్షివ్రాలు.
2. బత్తుల రామయ్యసాక్షివ్రాలు.

దస్తూరి—బత్తుల రమణయ్య, సా॥ రాజమండ్రి.

వరా— నూటికి 1—8—0 చొ॥ 1000 పదివందలరూపాయలుకు మనువృత్తి హామీాకుగాను రు 9-0-0 లున్ను వెరశి రు 24లు.

# మనువృత్తిదస్తావేజు

ది 29-4-1718 సం॥రము.

సాలీనా రు 50 లు యేబదిరూపాయలిచ్చుటకు.

| రాజమండ్రి కాపురస్తులు రెడ్లు నల్లపిల్లి పైడమ్మకు. | రాజమండ్రి ఆలకట్టుతోట కాపురస్తులు నల్లపిల్లి రామయ్య వ్రాయించియిచ్చినది. |
|---|---|

నీవు నాకు సోదరుని భార్యవగుటచేత నాసోదరుడు పోయిన నాటినుంచి నాకుటుంబముతోటిపాటే నీవుఫుంటూ ప్రస్తుతము మాలో వుండుటకు వాకిష్టము లేక నీజీవనోపాధికి యేర్పాటు జేయవలసినదని నీవు నన్ను కోరినందున నాకుటుంబస్థితినిబట్టిన్నీ, రాబడినినుసరించిన్నీ పెద్దమనుష్యులు చెప్పినప్రకారము సాలు 1 కి రు 50-0-0 యేబదిరూపాయిలు యిచ్చుటకు యేర్పాటుజేసి ఈదస్తావేజు వ్రాయించి యివ్వడమయినది. గనుక సదరు రు 50-0-0 యేబదిరూపాయిలున్ను పతిసంవత్సరము పుష్య శుద్ధ పౌర్ణమినాటికి ఒక్కమారుగానేనునీకు

యిచ్చి నీవల్ల రశీదుపొందగలవాడను. ఆవాయిదానాటికి యివ్వని యెడల సొమ్ముముట్టేవరకు నెల 1 కి నూటికి రు 1-0-0 రూపాయి చొప్పున వడ్డీతో యివ్వగలవాడను. ఇంతకన్న యేకారణముచేత నైనను యెక్కువ చేయమని నీవుగాని తక్కువచేయమని నేనుగాని వాదము చేయకూడదు.

యెట్టివాదము చేసినను మంజూరుకావు. ఇందుకుగాను యీ దిగువ నుదహరించిన ఆస్తిని హామీగా యివ్వడమైనది.

హామీ యిచ్చిన ఆస్తివివరము.

గోదావరి డి॥ ప్రత్తిపాడు సబుడి॥ వెంకటగిరి గ్రామము తాలూకు జిరాయితీ కల్లం నెం 55 రు య 8—25 ట్లు.

ఇది నాసమ్మతిని వ్రాయించి యిచ్చిన మనువృత్తి దస్తావేజు.

నల్లపిల్లి రామయ్యవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. సీమకుర్తి జగ్గారావు సా॥ వ్రాలు.
2. సీమకుర్తి సత్యనారాయణ సా॥ వ్రాలు.

దస్తూరి—బత్తుల రమణయ్య సా॥ రాజమండ్రి.

మరా—ఈదస్తావేజు రిజష్టరీ చేయించుకొనునప్పుడువ్రాయించిపుచ్చుకొన్నవారిచేతను దాఖలుచేయించినయెడల దస్తావేజుకుఒప్పుకొన్నట్లు రూఢియగును గనుక ఆప్రకారము చేయించుకొనుట మంచిది. సమ్మతిలేనియెడల యెదురుబడి దస్తావేజు.

## నెం ౨రు

ది 18—4—1929 సం॥రము.

భూమియిచ్చుటకు మనువృత్తి దస్తావేజు.

| రాజమండ్రి కాపురస్థులు రెడ్లు అవసరాల ముత్యాలమ్మకు. | రాజమండ్రి కాపురస్థులు అవసరాల శేషాద్రిరావువ్రాయించినది |
|---|---|

నీవు నాకు పినతండ్రిభార్యవగుటచేత నిన్ను పోషించుబాధ్యత

నాయందున్న హేతువచేతనున్ను నాకుటుంబస్థితిననుసరించిన్నీ ఈదిగువ నుదాహరించిన భూమిని నీయావజ్జీవము ననుభవించుటకుగాను యిచ్చివేయడమయినది. నీజీవితకాలమువరకు సర్కారుపన్నులు చెల్లించుకుంటూ అనుభవించుటకున్నూ అనంతరము నాకుటుంబము నకు చెందగలందులకు నిర్ణయము. భూమిపైన ఋణములుగాని చిర కాలపు కవుళ్లుగాని జరిగించగూడదు.

భూమి వివరము.

గోదావరి డి॥ రామవరము తాలూకా భీమవరము గ్రామము తాలూకు యీనాం పల్లం రీసర్వే నెం 543 రు య 3—0 ట్లు.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన మనువృత్తిదస్తావేజు.

అవసరాల శేషాద్రిరావువ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. పిట్ట అప్పలరెడ్డి సా॥ వ్రాలు.
2. యంపాడ అప్పలస్వామి సా॥ వ్రాలు.

దస్తూరి—బత్తుల రామయ్య, సా॥ రాజమండ్రి.

## నెం 3 రు

19—9—1928 సం॥ రము.

భూమి పూరాగా యిచ్చివేయు మనువృత్తిదస్తావేజు.

| రాజమండ్రి కాపురస్తులు అక్కా లమ్మకు— | రాజమండ్రి కాపురస్తులు పిట్టా అప్పలరెడ్డి వ్రాయించియిచ్చినది. |
|---|---|

నీవు నాకు పెద్దతండ్రికోడలవగుటచేతనున్ను నాకుటుంబాస్తి జాయింటుగా నుండుటచేతనున్ను నిన్నుపోషించుటకు బాధ్యత నాదిగాయుండుటచేతనున్ను ఈదిగువ నుదహరించినటువంటిఆస్తిని దాన విక్రయాది సంపూర్ణ హక్కులతో నీకు జరుగగలందులకుమనువృత్తి పరిశిష్టలముక్రింద యిచ్చివేయడమైనది. ఈభూమిని యెవరికి యేవిధ

మయిన అన్యాక్రాంతములు చేసినను నేను యేవిధమైన తగాయిదాలు చేయగలవాడనుకాను.

రామవరం డి॥ భీమవరం సబుడి॥ వేమవరం గ్రామముతాలూకు యీనాం పల్లం నెం 333 రు య 2—0 లు.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన భూమి పూరాగా యిచ్చి వేయు మనోవృత్తి దస్తావేజు.

పిట్టా అప్పలరెడ్డి వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1 అవధానుల సుబ్బిశెట్టి సాక్షి వ్రాలు.

2. దుర్గా వెంకటస్వామి సాక్షి వ్రాలు.

దస్తూరి—పప్పు అప్పలస్వామి వ్రాలు.

## పారీఖత్తు.

19—4—1929 సం॥రము.

రు 4000 లు నాలుగువేల రూపాయలు కిమ్మత్తుచేయు ఆస్తికి పారీఖత్తు.

రామచంద్రపురము తాలూకా కోరుమిల్లి కాపురస్తులు కమ్మవారు వ్యవసాయము మిత్తిన పట్టాభిరామయ్యగారు కుమాళ్లు 1 వెంకట్రామన్న 2 ఈ బుచ్చిబ్బాయి 3 రామచంద్రము వ్రాసుకొన్న పారీఖత్తు.

మనలో వెంకటరామన్నకు మిగిలినవారిద్దరు కుమాళ్ళు అయియున్నాము. మనకుటుంబమునకు ఈదిగువ నుదహరించినటువంటి స్థిరాస్తులువుండి సమిష్టిగా ననుభవించుచున్నాము. ఇట్లుండగా మనలో మనకు పడనందున యేకముగా వుండుటకు యిష్టములేనందున కుటుంబాస్తి పంచుకొనుటకు ఈదిగువనుదాహరించినప్రకారము చేసుకొన్న

యేర్పాటు వైనము ఇందులో జతపర్చిన ఎ షెడ్యూలుదాఖలాఆస్తి

1. వెంకట్రామన్న పుచ్చుకొనుటకు

బి. షెడ్యూలు దాఖలాఆస్తి

2. బుచ్చబ్బాయి పుచ్చుకొనుటకున్ను

సి. షెడ్యూలు దాఖలాఆస్తి

3. రామచంద్రము పుచ్చుకొనుటకున్ను యేర్పాటుచేసుకుని యెవరికి వచ్చినటువంటిఆస్తి వారు దానవిక్రయాది సమస్తాధికారములుకలిగి అనుభవించుటకున్ను యెవరివాటాలోవున్నఫలవృక్షములు వారు అనుభవించుటకున్ను నిర్ణయము. కుటుంబమునకు యేవిధమైన రుణములును లేవు. నివేశస్థలం యిల్లు వగైరాలు ప్రస్తుతము పంచుకొనినయెడల కాపురముండుటకు సావకాశము చాలదనిన్నీ మనతండ్రిగారు వాటా అన్యాక్రాంతమగునేమోయని భయముకలిగి పంచుకొనక ప్రస్తుతము సమిష్టిగానే యుంచినాము. మనతల్లిదండ్రుల జీవితానంతరము మన వుభయులము కీడుమేళ్ళవరుసను సమానముగా పంచుకొన నిర్ణయము.

గోదావరి డి॥ మున్సిబుడివరము సబుడి॥ బొబ్బర్లంకగ్రామములోని జిరాయితీపల్లం ఎ షెడ్యూలు నెం 313 రు య 3—14 ట్లు

నెం 472 రు య 2—14

నెం 50 రు య 3—0

వెరశి 8—28

బి. షెడ్యూలు.

నెం 356 రు య 4—42

నెం 357 రు య 2—15 ట్లు

నెం 358 రుయ3—0 ట్లు

వెరశి 9—57

సి షెడ్యూలు.

నెం 9 రు య 4—8 ట్లు

నెం 36 రు య 1—15

నెం 361 రు య 2—5

వెరశి 7—28 ట్లు

## నెం ౨ రు

ది 13 ఫిబ్రవరి 1929 సం॥రము

రు 10000లు పదివేలరూపాయలకిమ్మతుచేయు ఆస్తికి పారీఖత్తు

రాజమండ్రి కాపరస్తులు, వెలమలు అల్యూమినియంకంపెనీ వలన జీవనంచేసె దిడ్డింగి దొడ్డయ్యకుమార్లు ఈచిట్టెయ్య ఈబుల్లెయ్య ఈబాపన్నగార్లు కలిసి వ్రాయించుకున్న పారీఖత్తు.

మనము నలుగురము యేకోదరసోదరులమైయున్నాము. యిది వరకు మనకున్న చరస్థిరాస్థిలో సమిష్టిగా అనుభవించుచున్నాము. ఇప్పుడు ఆలాగున సమిష్టిగాయుండుటకు యిష్టము లేనందున యీావదాస్తులను ఈదిగువ నుదహరించిన ప్రకారమువిభజించుకొనడమైనది.

ఎ. మార్కువాటా మనలో చిట్టెన్నకును,

బి. మార్కువాటా బుల్లెయ్యకును,

సి. మార్కువాటా బాపన్నకును,

డి. మార్కువాటా తండ్రిగారగు దొడ్డయ్య

పుచ్చుకొనుటకు యేర్పాటు చేసుకున్నాము. యెవరివాటాకు

వచ్చిన ఆస్తులకు దానవిక్రయ స్వాతంత్ర్యము హక్కులుగలిగి అనుభ
వించే నిర్ణయము— మన కుటుంబమునకు యేవిధమైన ఋణము
లున్నులేవు. మనకు లోకులవల్లరావలసిన బాకీలలో చింతా వెంకయ్య
గారు యివ్వవలసిన తనఖా బాకీ రు 2000లు రెండు వేలరూపాయిలు
న్ను యిదివరకు మన కుటుంబ యజమానిగాయున్న మనలో తండ్రి
గారగు దొడ్డయ్యగారు వసూలుచేసి మనసోదరియైన వెంకమ్మకు వివా
హము సారీవగైరాఖర్చులక్రింద ఆయన యిష్టమువచ్చినప్పుడు ఖర్చు
పర్చవలసినది. మఱిన్ని ఈరవల్లి అచ్యుతరామన్నగారు యివ్వవలసిన
తనఖా బాకీ రు 3000లు మూడువేలరూపాయిలున్ను, మనలో నాల్గవ
వాడగు బాపన్న వివాహపుఖర్చులక్రింద యిచ్చుటకు తక్కినవార
మంగీకరించి ఆ పత్రము యిప్పుడే ఆతని కిచ్చివేయడమైనది. ఆపత్ర
ములపైన మనమందరము చెల్లువ్రాసియివ్వవలసినదని సదరు బాకీదా
ర్లుకోరేయెడల వారలకోరికప్రకారము మనమందరము చెల్లువ్రాసియి
చ్చేనిర్ణయము. మిగిలినబాకీ యెవరికి వాటావచ్చినది వారలమిప్పుడే
పుచ్చుకున్నాముగనుక వారలు వసూలుచేసుకొనుటకు హక్కుగలిగి
యుండనిర్ణయము. ఒకరివాటాలభూములలోనుంచి యింకొకరివాటాల
లోకి నీటివసతి కావలసివచ్చేయెడల ఆప్రకారము యేవిధమయిన ప్రతి
ఫలము కోరకుండా ఒకరికొకరు ఇచ్చేనిర్ణయము. ఇంతటినుంచియెవరి
వాటా భూములకు వారే పన్నులు చెల్లించుకుంటూ వచ్చినదానిలో
వారుండుటకు చాలక వేరేయవతలకు వెళ్ళునెడల వారితాలూకు
వాటాయిల్లు మాసోదర్లులోవారికే విక్రయించవలసినదిగాని అన్యు
లకు విక్రయించకూడదు.

ఎ మార్కు వాటాలో లోగిలి దక్షిణమువైపు చింతా పుల్లయ్య
గోడ 18 గజములు.

బి మార్కు వాటాలోలోగిలితూర్పువైపు దండంగి పెరటివైపు
గోడ సరిహద్దు 19 గజములు.

సి మార్కు వాటాలోగిలి పడమరవైపు వాటా 20 గజములు.

డి మార్కువాటాలోగిలి దక్షిణపువాటా 20 గజములు.

ఇళ్లేభూమికికూడా హద్దులు వ్రాసుకునేది.

ఇది మనము నలుగురము యేకస్తులమయి సమ్మతిని వ్రాసుకున్న పారీఖత్తు.

దిడ్డంగి దొడ్డయ్యవ్రాలు.
దిడ్డంగి చిట్టెయ్యవ్రాలు.
దిడ్డంగి బుల్లెయ్యవ్రాలు.
దిడ్డంగి బాపన్నవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. కరెట్ల కంఠయ్య సాక్షివ్రాలు. రాజమండ్రి.

2. దొడ్డిపట్ల దొరయ్యసాక్షివ్రాలు. సా॥ రాజమండ్రి.

దస్తూరీ—ఇంద్రకంటి చంద్రయ్య, సా॥ రాజమండ్రి.

షరా—ఒకవాటాకు మినహాయించి మిగిలిన మూడువాటాలకు క్రియమువలె స్టాంపుపెట్టవలెను.

# ఎగ్రిమెంటు

ది 23—1—1914 సం॥రము.

| | |
|---|---|
| గుడిమెట్లలంక కాపురస్థులు బ్రాహ్మణులు ఈనాందార్లు గుడిమెట్ల బసవరాజుగారి కుమాళ్ళు రామచంద్రరావుగారికి— | గుడిమెట్లలంక కాపురస్థుడు బ్రాహ్మణులు ఈనాందార్లు రాంభొట్ల సూర్యనారాయణగారి కుమార్డు సుబ్బారాయుడు వ్రాయించి యిచ్చిన క్రియపు ఎగ్రిమెంటు. |

గుడిమెట్లగ్రామములోనినాస్వార్జితముబాపతు ఈదిగువనుదహరించినటువంటిభూమిని రు3000లు మూడువేలరూపాయలకు క్రియముకుయిచ్చిరు100లునూరురూపాయలుమీవల్లఅడ్వాన్సుపుచ్చుకొన్నాను

గనుక మిగిలినక్రియధనము రు2900లు యిరువదితొమ్మిదివందలరూపా యిలున్ను ఈతేదీలగాయతుమూసము రోజులలోగా (అనగా 23 ఫిబ్ర వరి ఆ 1914 సంII రం) లోగా మీయిష్టమువచ్చినమువాయిదాప్రకా రము మీక్రియమున్నివిధములా చెల్లులాగున మీఖర్చులపైన క్రమ మైన రిజష్టరీకాలమందు పుచ్చుకొనగలవాడను. ఆలాగున వాయిదా లోపల వ్రాయించుకొనక నిరాకరించినయెడల ఈక్రియ మమలుజరు గుటయే గాకుండా అమలుజరుపుకొనుటలో నాకు వచ్చేనష్టము యావత్తూ ముజరా యివ్వవలసినది.

క్రియమునకు యిచ్చిన ఆస్తివివరము.

గోదావరిడిస్ట్రిక్టు అమలాపురంసబుడిస్ట్రిక్టు రాజోలుగ్రామము లోని యీనాంపల్లా నెం 452 రు య 3—59 ట్లు.

రాంభొట్ల సుబ్బారాయుడువ్రాలు.

యిందుకుసాక్షులు.

1. బోడపాటి బాబురావుసాక్షివ్రాలు.

2. వీణం చినవెంకటరావుసాక్షివ్రాలు.

దస్తూరీ—స్వదస్తూరీ.

## నెం ౨౮

ది 25 జనవరి 1925 సంIIరం దిన వేములపాడు కాపురస్తులు దేవాంగులు బట్టలనేత అంకాబత్తుల అచ్చన్న కుమారుడు రామయ్యా గారికి వేములపాడు కాపురస్తులు దేవాంగులు బట్టలనేత సూరాబత్తుల రామస్వామిగారికి కుమారుడు వీరన్నవ్రాయించియిచ్చిన యగ్రి మెంటు.

ఈదిగువ నుదహరించినటువంటి నివేశస్థలము యిల్లుతల్పులు ద్వారబంధములుయింటిపైకప్పుసహా యీరోజున మీకు రు200 లుకు రెండువందలకు క్రియకరది క్రియధనము తొలుకు రు 25 లు అడ్వా

న్నుగా పుచ్చుకున్నాను మిగిలిన రు 175 లున్ను యీ తేదీలగాయతు 25 ఫిబ్రవరి 1925 తేదీలోగా మాయిష్టము వచ్చిన ముహాయిదా ప్రకారము మీ క్రియ మన్నివిధములు చెల్లులాగున వ్రాయించి రిజష్టరి చేయించి యివ్వగలవాడను. ఆలాగున రిజష్టరి చేయించిన మీదట మిగిలిన క్రియధనము రు 195 లున్ను ఈయింటిపై యిదివరకుతనఖా శాకిని వారణాసి వెంకన్నగారికి యిచ్చి ఆపత్రముపయిన చెల్లువ్రాయించగా మిగిలిన సొమ్ము నాకు యిచ్చి రశీదుపొందవలయును. అలా వాయిదా లోపున మీరు కోరినప్పుడు క్రియదస్తావేజు వ్రాయించి యివ్వనియెడల మీకు రు 100లు నష్టముక్రింద యివ్వగలవాడను.

క్రియ ఆస్తివివరము.

గోదావరి డి॥ భీమవరం సబు డి॥ కాపవరంగ్రామం తాలూకు నివేశనస్థలము తాటియాకుల యింటికి హద్దులు.

X 18 తూర్పు—సంకాబత్తుల వెంకన్నయిల్లు.

X 10 దక్షిణము—సూరాబత్తుల సన్యాసి స్థలము.

X 18 పడమర—రంగా వెంకన్నయిల్లు.

ఉత్తరం—రామకోవెల.

ఈహద్దుల మధ్యస్థలమున స్థలము యిందులో తాటియాకుల యిల్లు వగయిరాతో మీకు క్రియను యివ్వడమయినది.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన యగ్రిమెంటు.

సూరాబత్తుల వీరన్న వ్రాలు

ఇందుకు సాక్షులు.

1. శివ్వా రామరాజుసాక్షి వ్రాలు.

2. బత్తుల రామయ్యసాక్షి వ్రాలు.

దస్తూరి—దుర్గా వెంకటస్వామి, కోరుకొండ.

యెంతకయినను రు0—12—0 స్టాంపు. అంతకన్న యెక్కువ అవసరములేదు.

# నౌకరి యెగ్రిమెంటు

**నె 1 కి రు 15 లు చొ॥న యిచ్చుటకు 3 సంవత్సరములకు.**

ది 14—1—1929 సం॥రము తేదిని.

రాజమండ్రి యిన్నీసుపేట కాపురస్తులు వైశ్యులు సీమకుర్తి మల్లన్న గారికి-

రాజమండ్రి నరసింహారావుపేట కాపురస్తులు వైశ్యులు బత్తుల రమణయ్య వ్రాయించి యిచ్చిన నౌఖరి యగ్రిమెంటు.

తమ తాలూకు అచ్చాఫీసులో నేను కంపోజిటరుగా యుండి పనిచేయుటకున్ను అందుకుగాను నె1కి రు 15 చొ॥ జీతము యిచ్చుటకున్ను వప్పుకుని మీవద్ద రు 25లు ముందు పుచ్చుకున్నాను. సదరు పాతికరూపాయలున్ను నాకు యిచ్చేజీతములో నె1కి 2-0-0 చొ॥ తీర్చుకుంటూ మిగిలిన రు 23 లు నాకుయిచ్చి నావల్లరశీదులు పొందుతూ యుండవలయును. ఆలాగున సంవత్సరమునకు పనిచేయుటకు వప్పుకుంటిని. ఆలోపల నేను మానివేసినట్లయితే నాపని మానినందువల్ల మీకు వచ్చేనష్టము వ దరాయిస్తును. మీరునన్ను మాన్పించినయెడల పయిన వుదహరించిన జీతము నాకు యివ్వవలసినదేగాని మానివేయనిమిత్తములేదు. ఇది నాసమ్మతిని వ్రాయించిన నౌఖరి యగ్రిమెంటు.

బత్తుల రమణయ్యవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. పెంటా వెంకన్న సా॥ వ్రాలు.
2. అంకం సత్తిరాజు సా॥ వ్రాలు.

దస్తూరీ—బత్తుల రామయ్య, సా॥ రాజమండ్రి.

రు 0—12—0 స్టాంపు.

# జనరల్ పవరాఫ్ అటర్ని

ది 10—9—1928 సం॥రము,

రంగాపురం కాపురస్తులు బ్రాహ్మణులు యీనాందారులు రామ కేసరి వెంకట్రావుగారి కుమాళ్ళు రామారావుగారికి — రంగాపురం కాపురస్తులు బ్రాహ్మణులు యీనాందారులు పెండ్యాల రంగారావుగారికుమారుడు సుబ్బారావు వ్రాయించియిచ్చినది.

నాతాలూకు గంజాము డి॥ లో గోపాలపురం తాలూకా సిరగడాం గ్రామములోని భూమివున్నది. ఆభూమి సరిఅయిన అమరకములు వగయిరాలు చేయుటకున్ను అవసరమయినయెడల మరమ్మతులు వగయిరాలు చేయించుటకున్ను క్రియపరచవలసినయెడ క్రియపర్చుటకును ఆలాగున యేచర్య జర్పించవలసినప్పుడు ఆచర్య జర్పించుటకు అందుకు కావలసిన క్రియదస్తావేజులు కవుళ్ళువగయిరా యావత్తువగయిరాలు వ్రాసియిచ్చుటయేగాక సబురిజిస్ట్రారువారి ఆఫీసులోరిజిష్టరు చేయించుటకున్ను అవసరముబడిన కోర్టులో నాతరపున వకాల్తునామావగయిరాలు దాఖలుచేయుటకున్ను మీకు అధికారమివ్వడమయినది. నాతరపున మీరు జరిగించు యావత్తుగ్రంథములు నేను స్వయముగా జర్పించుకున్నట్టు వప్పుకుంటున్నాను.

ఇతి సమ్మతిని వ్రాయించియిచ్చిన జనరలు పవరాఫ అటర్నీ.

పెండ్యాల సుబ్బారావు వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. సైకపట్ల చింతలయ్య సా॥ వ్రాలు.
2. గోనుల గోపాలస్వామి. సా॥ వ్రాలు.

దస్తురీ—మానేపల్లి సత్యం, సా॥ రాజమండ్రి.

# తనఖాహక్కువిడుదలదస్తావేజు లేక రిలీజు దస్తావేజు

29—7—1816 సం॥రము.

విశాఖపట్టణం కాపురస్తులు కోమట్లు బత్తులరామయ్యగారి కొమారుడు రామయ్యగారికి—

రాజమండ్రి కాపరస్తులు శివ్వా పురుషోత్తముగారి కొమారుడుశివ్వాపోతిరాజు వ్రాయించి యిచ్చినది.

నాకు గోదావరిజిల్లా అమలాపురంతాలూకా ముమ్మిడివరం గ్రామకాపరస్తులు కవిపురపురామజోగన్నగారు తమతాలుకు ఆస్తిని అడ్వాన్సుగా తనఖావుంచి అడ్వాన్సుగా తనఖాదస్తావేజు వ్రాయించి యున్నారు. ఆతనఖాఆస్తిలో రాజపాలెం గ్రామంతాల్కు జిరాయితి వల్లం నెం 678 రు య 2—0 భూమిని 2000 లుకు మీారుక్రియము పుచ్చుకుని సదరు క్రియధనములో రు 1900లు నాకు వసూలుయిచ్చి సదరు ఆస్తియందు మాకుగల తనఖాహక్కును వదలుకొని వదలు కొన్నట్లుదస్తావేజు వ్రాయించి యివ్వడమయినది. కాబట్టి సదరుభూమి వయిన నాకు వున్న తనఖాహక్కుయావత్తువదలుకొన్నాను. నా బాకి మిగిలినసొమ్ముకు తనఖాఆస్తివల్ల రాబట్టుకొందునుగాని ఈఆస్తిమీాద వసూలు రాబట్టుకోగలవాడనుకాను. ఇది సమ్మతిని వ్రాయించి యిచ్చిన హక్కువిడుదలదస్తావేజు.

శివ్వా పోతిరాజువ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. బత్తుల రమణయ్యా సా॥ వ్రాలు.
5. దుర్గా వెంకటస్వామి సా॥ వ్రాలు.

దస్తూరి—పెంటా వెంకన్న.

నూటికి రు 0—12—0

# మనువృత్తిహక్కు విడుదల దస్తావేజు.

11—9—1229 సం॥రము.

| | |
|---|---|
| వట్నవిల్లి కాపురస్థులు బ్రాహ్మణులు యీనాందార్లు రామావజ్ఝుల వెంకన్నగారి కుమారుడు బుచ్చెన్నగారికి— | అమలాపురం గ్రామకాపరస్తులు బ్రాహ్మణులు ఈనాందారులు రామావజ్ఝల నరసింహం గారి భార్య సుబ్బమ్మ వ్రాయించి యిచ్చినది. |

మీ తండ్రిగారు నాకు యావజ్జీవము యిచ్చుటకుగాను సాలీనా రు 50 లు యేబదిరూపాయలిచ్చుటకుగాను దస్తావేజు వ్రాయించి యిచ్చి దాఖలారము సబురిజిష్ట్రారు ఆఫీసులో 1 వ పుస్తకం 343 వాల్యూం 1922 పుటలో 1897 సం॥రము 1272 నెంబరులో రిజష్టరు చేయించి ఇచ్చియున్నారు. సదరుప్రకారము ఇకముందు మేము మను వృత్తి యిచ్చుకోలేమనిన్నీ, వదలివేయవలసినదనిన్నీ, మీరు నన్ను కోరినందున నేను ఆప్రకారమంగీకరించి ఇకముందునుంచి సదరు దస్తావేజు ప్రకారము మనువృత్తిరాబట్టుకొను హక్కును యిందుమూలముగా వదలుకున్నాను. మిమ్ములనుగాని, మీస్థానీయులనుగాని మీ వార్సులనుగాని మనువృత్తివిషయములో యెన్నడూతగాయిదా చేయగలదాననుగాను. నాకువ్రాసిఇచ్చిన మనువృత్తి దస్తావేజులోనున్న హామీఆస్తిపైని నాకుగల యావత్తు హక్కును వదలుకున్నాను, ఆస్థిని మీఇష్టప్రకారము జరిగించుకొనవచ్చును.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన మనువృత్తి హక్కువిడుదలదస్తావేజు.

వజ్ఝల సుబ్బమ్మవ్రాలు.

సాక్షులు.

1 సంగీతం కనకయ్య సాక్షివ్రాలు.

2 పచ్చిపులుసు పుల్లయ్యసాక్షివ్రాలు.

దస్తూరీ—చింతా చిన్నయ్య సా॥ రాజమండ్రి

మరా—అసలు దీనిస్టాంపు 'ఖరీదెంతయుండునో దీనికికూడా నంతియేస్టాంపు పెట్టవలెను.

# క్రియము హక్కు విడుదల దస్తావేజు.

18—6—1928 సం॥రము

రాజమండ్రి కాపురస్తులు వ్యవసాయము కాపులు చింతా చినసత్తిరాజుగారి కుమారుడు బుచ్చిరాజుగారికి.

రాజమండ్రి ఇన్నీసుపేట కాపురస్తులు వెలమలు వ్యవసాయము కఠారి గంగరాజుగారికుమారుడు బుల్లిబ్బాయిగారు వ్రాయించి యిచ్చినది.

మీరు నాకు రాజమండ్రి డి॥ రాయకుదురు సబుడి॥ మామిడన్న గ్రామములోని జిరాయితీపల్లం నె 357 రు య 3—0 భూమినిన్ని రు 2000లు రెండువేల రూపాయిలకు క్రియపర్చి రాయకుదురు సబు రిజిష్ట్రారు ఆఫీసులో 1923 సం॥రము 1వ పుస్తకము 3వాల్యూం 199 పేజీలో నెం 197 రిజిష్టరీ చేయించియిచ్చినారు. సదరు క్రియధనము పత్రములో వ్రాసినప్రకారము సొమ్ము యిప్పటివరకు వసూలు యివ్వనందున అందువల్ల మీకు విశేష నష్టము గలుగుచున్నదనిన్ని క్రియము వదలివేయవలసినదనిన్ని మీరు నన్ను కోరినందున నాకుగల క్రియపు హక్కును యావత్తు వదలుకొని మీకు దస్తావేజు వ్రాయించి యిచ్చినాను గనుక సదరుభూమిని మీయిష్టముప్రకారము స్వాధీనము చేసుకొని దానవిక్రయాది సమస్తాధికారములు కలిగి మీయిష్టప్రకారమనుభవించవలయును.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన క్రియము హక్కు విడుదల దస్తావేజు.

కఠారీ బుల్లబ్బాయివ్రాలు.

యిందుకు సాక్షులు.

1 చోళ్ళ సుబ్బయ్య సా॥ వ్రాలు

2 బందరు భావన్న సా॥ వ్రాలు

దస్తూరి—నిట్టల గోవిందు సా॥ రాజమండ్రి

మరా—మొదటి దస్తావేజువలెనే

## దత్తతరద్దు దస్తావేజు

20—11—1929 సం॥రము

రాజమండ్రి ఇన్నీసుపేట కాపురస్తులు యీనాందార్లు బ్రాహ్మణులు గోటేటి మంగారావుగారి కుమారుడు చంద్రశేఖర రావుగారికి

రాయవరము గ్రామకాపురస్తులు యీనాందార్లు గోటేటి సుబ్బయ్యగారి భార్య రాజ్యలక్ష్మమ్మ వ్రాయించియిచ్చినది.

నీకుమారుని నాకు దత్తుగా యిచ్చుటకు యేర్పాటుచేసుకొని పెద్దమనుష్యులు కృతముగా నాఆస్తిదత్తునికివ్రాసియివ్వవలసినదనిమీరు నన్నుకోరినందున నేను వంశాభివృద్ధి కాగలదను సదుద్దేశ్యముతో మీరు దత్తునిగా యివ్వకపోయినను ముందు యిచ్చెదనని చెప్పిన మీ మోసపుమాటలను నమ్మినేను నీకోరిన ప్రకారము దస్తావేజువ్రాయించియిచ్చుటయేగాని భూములు నాస్వాధీనములోనే వుంచుకొనియుంటిని. ఆప్రకారము యెన్నిదఫాలు కోరినను పిల్లవానిని నాకుదత్తునిగా యియ్యకపోవుటయును మునుపటివలెనే మీరు మంచి స్వభావముగా యున్నట్లు కనబడకపోవుటచేతనున్ను భూములు స్వాధీనపరచుకొనగల యుద్దేశ్యముతో నున్నారని నాకుదెలిసి మీరుచేసిన కృత్యం మోసమని నేనుయెంచి మీకు రిజిస్టరీనోటీసుకూడా యిచ్చినాను అట్టినోటీసు యిచ్చిన దరిమిలానుగూడ మీరు యుపేక్షాభావము వహించి యుండుటచేత నామకః పుట్టబడిన సదరుదస్తావేజునురద్దుచేయుట సర్వవిధ

ముల యుత్తమమని యెంచి యిందుమూలముగా మొదట మీకు నేను వ్రాసియిచ్చిన దస్తావేజు రద్దగుననియెంచి యీదస్తావేజు వ్రాయించి రిజిష్టరీ చేయించే మీకు పంపించినానుగనుక మొదటిదస్తావేజుమూలముగా నీకు గలిగిన యావత్తుహక్కులురద్దయినవని యెంచుకొనవలయును. నేను మరొక పిల్లవానిని వైశాఖ శు॥ సప్తమీ నాడు దత్తత జేసికొన దలచియున్నాను.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన దత్తతరద్దు దస్తావేజు
గోటేటి రాజ్యలక్ష్మమ్మవ్రాలు

సాక్షులు

1 పెంటా వెంకన్న సాక్షి వ్రాలు.

2 బత్తుల రామయ్యసా॥ వ్రాలు.

దస్తూరి బత్తుల రమణయ్య, రాజమండ్రి.

వరా—మొదటిదస్తావేజు యెంతఫీజుతోనుంటే దీనికికూడాఅంతే

# మరణశాసనము లేక విల్లు.

ది 19 జనవరి 1926 తేదీని
రామవరం కాపురస్థుడు ఆరాధ్యుల
రామలింగన్నగారి కుమారుడు భీమ
న్న వ్రాయించిన విల్లులేక మరణ
శాసనము,

నేను పెద్దవాడ నగుటచేత నాతాలూకు ఆస్తికి యేదైనా యేర్పాటుచేయుట మంచిదని తోచి ఈదిగువవిధముగా ఏర్పాటు చేయడమైనది.

రామవరం గ్రామములోని తూర్పుపోలమనే పేరుగల నె 238 రుగల ఈనాంపల్లం య 2—0 భూమిన్నీ శ్రీరామచంద్రస్వామి

వారి ఆలయములో నందాదీపము వుంచుటకుగాను యిచ్చివేయడమైనది. నాభార్యకు ఆమెయిష్టము వచ్చినపుడు నాఅన్నగారి మనుమడైన భీమన్ననుగాని లేదా ఆమెయిష్టము వచ్చిన చిన్నవానినిగాని దత్తతచేసికొనుటకు అధికారమివ్వడమైనది. వంశాభివృద్ధికొరకున్ను మాయుత్తర లోకప్రాప్తికిన్ని ఆప్రకారము దత్తతచేసికొనవలయునే గాని ఆస్తి నేవిధముగాను అన్యాక్రాంతము చేయకూడదు. గ్రామమును చేరియున్న పాటిపెరటిలో గుత్తుల రాముడు నాకు యివ్వవలసిన తనఖాబాకి రు 5000 లు అయిదువేల రూపాయలున్ను వసూలు చేసి నాపేరుతో గ్రామస్తుల సౌకర్యముకొరకు రెష్టుహౌసు లేక విశ్రాంతి భవనము కట్టించవలయును. యేకారణముచేత నైనను దత్తునికి నాభార్యకు పడనియెడల పల్లపుపొలమనే 475 నెంబరు య 5—0 ల భూమి ఆమె యిష్టప్రకారము సర్వవిధములా అనుభవించవలయును. మిగిలిన నాకు రావలసిన ఋణములు యావత్తు నాభార్యయే వసూలుచేసుకొని అనుభవించవలయును. ఈవిల్లు నామనఃపూర్తితో మంచి తెలివితేటలతోటిన్ని వ్రాయించడమైనది. ఈవిల్లు రద్దుచేసుకొనుటకు ఆధారము నాయందే యుంచుకొనడమయినది. ఈవిల్లులోని షరతులు యావత్తూ నాజీవితానంతరము నుండి అమలు జరుగవలయును.

ఆరాధ్యుల భీమన్న వ్రాలు.

యిందుకు సాక్షులు.

1 చెంచుల పున్నయ్య సాక్షి వ్రాలు.
2 ముత్తంగి శేషయ్య సాక్షి వ్రాలు.

దస్తూరీ—చేతివ్రాతల చెంచయ్య. రాజమండ్రి

షరా—స్టాంపుఅవసరములేదు. రిజష్టరీకూడా కంపల్సరీగాదు.

ది 15—3—1926 తేదీని

రాయవరం గ్రామకాపురస్తులు బ్రాహ్మణులు యీనాందార్లు సర్రావజ్ఝల

నరయ్య కుమారుడు భూవయ్య
వ్రాయించిన విల్లు లేక మరణశాసనము.

నాకు కుమారులు కుమార్తెలు కూడా కలరు. మేము కుటుంబము సమిష్టిగానే యున్నారము. మాకు పూర్వార్జితపు యాస్తి కొంత యున్నది. ఆ ఆస్తిపైన వచ్చు ఆదాయము మాకుటుంబమునకు చాలని దైయున్నది. ఇట్లుండగా 1921 సం॥రములో నాజ్ఞాతికుటుంబములోని కొంతఆస్తి వారసత్వేణ నాకు దఖలుపడినది. ఆయాస్తిని సంపాదించుటలో నాకుటుంబ ద్రవ్యమును యేమాత్రమును ఖర్చుచేయలేదు. సదరు ఆస్తిని నాస్వాధీన మయినప్పటి నుంచియును నాస్వంత హక్కుగాను అనుభవించుచూ యున్నాను. అట్టి ఆస్తిలో య 3—0 మూడు యకరముల భూమి నాభార్యకు పూర్ణాధికారముతో యిచ్చి వేయడమైనది. య 2-భూమి నాచిన్న కుమారుడు వెంకటరత్నమునకు వివాహపు ఖర్చులక్రింద అదనముగా యిచ్చివేయడమైనది. మిగిలినయాస్తి యావత్తు సమానముగా అనుభవించుచూ నాకుమార్తెల కిద్దరికి సా 1కి రు 20 యిరువది రూపాయలు చొ॥ బట్టలనిమిత్త మిచ్చుచూ యుండవలెను. ఈవిల్లు మంచి తెలివితేటలతోటి వ్రాయడమైనది. నాకు యిప్పటికి యేవిధమైన జబ్బును లేకపోయినప్పటికిన్నీ కాలస్థితి ననుసరించి కుటుంబ కలతలు కలుగునేమోయని యిట్టి యేర్పాటు చేయడమయినది. ఈవిల్లులోని హంశముయావత్తు నా అనంతరమునుండి అమలు జరుగవలెను. ఈవిల్లు రద్దుచేసుకొనుటకు అధికారము నాపైనే యుంచుకొనడ మయినది.

ఇదినాసమ్మతిని వ్రాయించియిచ్చిన విల్లు లేకమరణశాసనము.
నర్రావజ్ఝల భూపయ్య వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. దండంగి దొరయ్య సా॥ వాృలు. రాయవరము.

2, దొడ్డరాజుల మునెయ్య సా॥ వాౄలు. వెదురుపాక.

దస్తూరి—చంద్రుడు సూర్యనారాయణ, రాయవరము.

మరా—స్టాంపుడ్యూటీ దీనికక్కర లేదు.

రమారమి 150 లు కిమ్మతుచేయు 600 కుంచములు ధాన్యం యిచ్చుటకు రు 10 లు కిమ్మతుచేయు 2 బొడ్డులగడ్డి రమారమిరు4లు కిమ్మతుచేయు చెరిసగము మామిడికాయలు యిచ్చుటకు 5 సం॥రము లకు కవులు.

10—8—25 సం॥రము.

పాలెపు రామన్నగారికి | చింతాలక్ష్మన్న వ్రాయించియిచ్చినది

యీదిగువ నుదహరించినటువంటిన్ని నాస్వార్జితము బాపతు భూమికి సాలు 1 కి రు 600 ఆనువంచల కుంచములధాన్యము శిస్తు చొ॥ ప్లవసం॥ రము లగాయతు విశ్వావసు సం॥రము ఆఖరుకుసం॥రం 5 కి మీాను వప్పుకుని కదపా వ్రాయించి యిచ్చినందున యీకవులు వ్రాయించి యివ్వడమయినది. ఈభూమి సాల్లుజస్తాలో నేనుయిచ్చిన కవులుప్రకారము నీస్వాధీనములోనేయున్నందున యీరోజున నీకు స్వాధీనము చేయనవసరము లేదు. సదరు శిస్తు ధాన్యం రాయి పొల్లు వెడ్డ చెత్త నెమ్ము లేకుండా ప్రశస్తముగా బాగుచేయించిఅలా బాగు చేయించిన కొనామణిధాన్యము బజారుసీలుకుంచము నబజారుఆరిందా కొలగానిచేత కొల్పించి రాజమహేంద్రగ్రామములో మాయింటి వద్ద మీాఖర్చులమయిన ప్రతిసం॥రం పుష్యశుద్ధపౌర్ణమి నాటికి వప్ప గించవలయును. అలా వప్పగించకున్నను వప్పగించే ధాన్యము ప్రశ స్తముగా లేకున్నను వాయిదా రోజున బజారుధరప్రకారము అయిన ఖరీదున్ను ఆఖరీదు మొత్తముకు నె1కి నూ 1 కి రు 2—0—0 లం

చొ॥ వడ్డీతో సొమ్ము ముట్టేవరకు యివ్వ నిర్ణయము. షరతుపర్యంత రము యావత్తుపన్నులు మీరు యిచ్చుకోవలయును. సర్వీరాళ్ళు జాగ్రత్తపెట్టవలయును. ధాన్యముతోపాటు 2 బొద్దులగడ్డి తోలిపె ట్టించ నిర్ణయము. ఈభూమిలోనుండే ఫలవృక్షములు కాయునెడల కాపుచేసి ఫలించిన పంటలో చేరిసగము మాకు వప్పగించే నిర్ణయం. ఆలాగున చేయనియెడ మాకు కలిగే నష్టము మీరు యిచ్చుకోగల నిర్ణయము. షరతాఖరు సం॥రమున చెరకుతోటదాళువా చేనువగైరా సాగుబడిచేయకుండానున్న ఆకుమడి॥ తగినభూమిలో యేవిధమైన పైరులేకుండా నుండులాగున యిందుకు రైతుకు వ్యవసాయమునకు లాయకుగా నుండులాగున ఆకుమడి దున్ని విశ్వావసు సం॥ర ఫాల్గుణ బహుళ అమావాస్యకు మాభూమి మాఆధీనముచేయ నిర్ణయం. ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన కవులు.

గోదావరి డి॥ వెంకటగిరి సబుడిస్ట్రిక్టు మార్కాపురం గ్రామం తాలూకు యీనాంపల్లం నెం 1899 య 0—75 ట్లు.

చింతా లక్ష్మన్న వ్రాలు

ఇందుకు సాక్షులు.

1. బత్తుల రామయ్య సా॥ వ్రాలు.
2. పెంటా వెంకన్న సా॥ వ్రాలు.

దస్తూరి—దుర్గా వెంకటరమణయ్య సా॥ రాజమండ్రి.

---

రు 140 లు శిస్తుకు 5 సం॥రములకు కవులు.

18—8—1613 సం॥రము.

ఆకొండి వెంకన్నగారికి—చీమలపాటి వెంకటరమణయ్య వ్రాయించి యిచ్చినది.

ఈదిగువ నుదహరించినటువంటిన్ని మాపూర్వార్జితము బాపతు భూమి సా1కి రు 140 లు నూటనలుభైరూపాయలు చొ॥న శిస్తు

ఇందుకు హద్దులు.

తూర్పు—రయిలురోడ్డు.

దక్షిణము—గోదావరిగట్టు.

పడమర—రైలురోడ్డు.

వుత్తరం—దుర్గావారి సత్రముగోడ.

ఈహద్దులు మధ్యస్థమయిన పెంకుటిల్లు నేను అద్దికి పుచ్చుకొనడమయినది.

ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన అద్దెచీటి.

శివ్వా పోతిరాజు వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. పుచ్చల వెంకటరత్నము సా॥ వ్రాలు రాజమండ్రి.
2. వరదా రామమూర్తి సా॥ వ్రాలు, రాజమండ్రి.

దస్తూరి—బత్తుల రమణారావు, సా॥ రాజమండ్రి.

# రశీదులు.

ది 19 మార్చి ఆ 1612 సం॥రం తేదిని అమలాపురం అచ్చన్న గారికి—

జవ్వాది వీరబ్రహ్మం వ్రాసియిచ్చిన రశీదు.

మీరు మాకుయివ్వవలసిన యింటిఅద్దె లోగడగ 1 మాసము తాలూకు అనగా ఈ మార్చి నెలాఖరుకు అయిన అద్దె రు 33 లున్ను ఈ రోజున నాకు యిచ్చినారు గనుక ముట్టినది.

ఇది సమ్మతిని వ్రాసియిచ్చిన రశీదు.

జవ్వాది వీరబ్రహ్మం వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. తెలబొట్ల సన్యాసి సా॥ వ్రాలు.
2. ఈకప్పి వీరన్న సా॥ వ్రాలు.

దస్తూరి—చినము సూరన్న. రాజమండ్రి.

# దత్తతాధికారపత్రిక.

ది 8—2—1920 సం॥రము

విశాఖపట్నం కాపురస్తులు బత్తుల రామయ్య కుమార్డు రామయ్యకు || విజయనగరము కాపురస్తులు వైశ్యులు దుర్గా లచ్చన్నగారి పెద్ద కుమారుడు వెంకటరమణయ్య వ్రాయించియిచ్చినది.

మీరు మాకు పినతండ్రికొడుకు అయివున్నావు నాకుమీకన్న ముఖ్యసన్నిహితవారసులు యెవరున్నూ లేరు. మనకుటుంబములు విడిపోయి చాలాకాలమయినది. అప్పటినుండి వేరువేరుగా కాపురముంటున్నాము. మాపినతండ్రి ఆకస్మికముగా చనిపోయినందువల్ల మిమ్ములను పెంచుకునమని అధికారము యిచ్చుటకు అవకాశము లేకపోయినది. మీవంశాభివృద్ధికొరకు యెవరినయినా పిల్లవానిని పెంచుకును అభిప్రాయమున్నది. అట్టి అధికారము కలుగచేయవలసినదని మీరునన్ను కోరినందున నేను అంగీకరించి యీదత్తతాధికార పత్రిక వ్రాయించియిచ్చినాను గనుక మనకుటుంబములో పిల్లవానిని గాని అలాగున మీకు యిష్టములేనియెడల మరివకకుటుంబములో పిల్లవానిని మీయిష్టమువచ్చినప్పుడు దత్తతచేసుకొనుటకు యిందుమూలముగా వప్పుకోవడమయినది.

ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన దత్తతాధికారపత్రిక.
దుర్గా వెంకటరమణయ్య వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1 బత్తుల రమణయ్య సా॥ వ్రాలు.
2 మొంపాడ అప్పలస్వామి సా॥ వ్రాలు.

దస్తూరీ—శివ్వా కామరాజు, రాజమండ్రి.

# దత్తత దస్తావేజు.

10—9—1928 సం॥రము.

| రాజమండ్రి కాపురస్తురాలు మన బొట్ల అక్కయ్యమ్మ వ్రాయించి యిచ్చినది. | రాజమండ్రి కాపురస్తులు బత్తుల రమణయ్యకు- |
|---|---|

నాభర్తగారు నాకు యిచ్చిన అధికారము ప్రకారము మీ కుమారులలో 2 వ వాడగు శ్రీరాములు అనేపిల్లవానినిమనహిందూ ధర్మశాస్త్రప్రకారము దత్తతచేసుకొనియున్నాను. గనుక నాభర్త తాలూకు వున్నయాస్తికి అతనిని కర్తగాన్ను మా వుభయులకు వుత్తరక్రియలుజరుపుటకు కుమారునిగాభావించుకొనియేయున్నాము. ఆప్రకారము వ్రాతమూలము జరిగించవలసినదని మీరు నన్ను కోరినందున యీ దస్తావేజు వ్రాయించియివ్వడమయినది.

మనుబొట్ల అక్కయ్యమ్మవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. పిట్ల అప్పలరేడ్డి సా॥ వ్రాలు, రాజమండ్రి.
2. ఎంపాడ అప్పలస్వామి సా॥ వ్రాలు, రాజమండ్రి.

దస్తూరి—మేకల శేషాద్రిరావు, రాజమండ్రి.

# తనఖాట్రాన్సుఫరు దస్తావేజు.

ది 1—4—1921 సం॥రము.

| రాజమండ్రి కాపురస్తులు తెలగాలు వ్యవసాయము కూచిమంచిసత్రాజు గారి కుమారుడు భూపరాజుగారికి_ | రాజమండ్రి గ్రామ కాపురస్తులు యీనాందార్లు బ్రాహ్మణులు జోగిశెట్టి సుబ్బయ్య గారికుమారుడు వెంకటాద్రియ్య వ్రాయించి యిచ్చినది. |
|---|---|

రాజమండ్రి కాపురస్థులు కూచిమంచి సరోజుగారు నాపేరను ది 15 ఏప్రియల్ 1914 సం॥ రము తేదీని రు 800 లకు అస్వాధీనపుతనఖా వ్రాయించియిచ్చి ఆలమూరు సబ్ రిజిస్ట్రారువారి ఆఫీసులో 1 వ పుస్తకం 2 వ వాల్యూం నెం 356 రు 516 పుటలో రిజిష్టరీచేయించి యిచ్చినారు. సదరుదస్తావేజు సరియైన ప్రతిఫలమునకు పుట్టబడ్డదై యున్నది. సదరుదస్తావేజుయొక్క అసలీఫాయిదాలు మొత్తముకింద రు 1400 లు పదునాల్గువందలరూపాయలు మీావలన పుచ్చుకొని మీాకు ట్రాన్సుఫరు చేసినారు కనుక సదరుదస్తావేజుయందు నావలెనే మీారు సంపూర్ణాధికారముగలిగి బాకీయావత్తురాబట్టుకొనవలయును. నేను వ్రాయించుకొన్న పైన వుదహరించిన దస్తావేజు యిందుతో మీాకు యిచ్చివేయడమయినది.

జోగిశెట్టి వెంకట్రామయ్యవ్రాలు.

సాక్షులు.

1. బత్తుల రమణయ్య సా॥ వ్రాలు,
2. కట్టా అప్పలరాజు సా॥ వ్రాలు.

దస్తూరి—పెంటా వెంకటరమణ, రాజమండ్రి.

స్టాంపు అమలుపత్రమునకు రు 6—0—0 గనుక ఈదస్తావేజుకు అంతే.

# నోటుట్రాన్సుఫరు.

ఈనోటుతాలూకు అసలీఫాయిదాలు రు 335 మూాడువందల ముప్పదియైదు రూపాయలలో నీలాభము నిమిత్తము రు 50 యేబది రూపాయలు మాానివేసి మిగిలిన రు 280 రెండువందల యెనుబది రూపాయలున్ను నీవల్ల నగదు ప్రతిఫలింపుచ్చుకొని ఈనోటు చింతలపూడి సరయ్యగారగు తమకు ట్రాన్సుఫరు చేసినారు గనుక సదరు అసలీఫాయిదాలు యావత్తు తమరు నావలెనే రాబట్టుకొనవలయును.

ఇందలి లాభనష్టములు నీవే రాబట్టుకొనవలయును గాని నాకేమియు నిమిత్తము లేదు.

ఇది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన నోటు వ్రాలున్ను స్వహస్త్రాక్షరు.

బసంగి బసవన్న వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. చాగంటి బాపినీడు సా॥ వ్రాలు.

2. గోట్టుముక్కల గోపాలస్వామి సా॥ వ్రాలు.

దస్తూరి—బత్తుల రమణయ్య సా॥ రాజమండ్రి.

# పాలివ్యాపారపు దస్తావేజు

1. రాజమండ్రి కాపురస్తులు కోమట్లు వ్యాపారమువల్లజీవించే కోటికలపూడి గోవిందయ్య కుమారుడు సత్యనారాయణ,

2. రాజమండ్రి కాపురస్తులు కోమట్లు వ్యాపారమువల్లజీవనం చేసే గుత్తంగి ముత్తయ్యకుమారుడు సత్తెయ్యయును యిద్దరు యేకస్తులై వ్రాసుకున్న పాలివ్యాపారపుదస్తావేజు.

మన వుభయులము చేరి రు 500 లు అయిదువందల రూపాయలు పెట్టుబడిపెట్టి రాజమండ్రిలో బట్టల వ్యాపారము చేయదలచుకున్నాము గనుక సదరు వ్యాపారమునకు సరియైన లెక్కలువుంచి ఖాతాలు మన వుభయులపేరనుంచి జరిగించుచూ ప్రతిసంవత్సరము లాభనష్టములు జనవరీ 1 తేదీనాటికి లెక్కచూచుకుంటూ యెవరి తాలూకువచ్చిన లాభనష్టములు వారిఖాతాకుజమాఖర్చు చేసుకుంటూ సొమ్ములు పరిహారాలు చేసుకునే నిర్ణయము. ఈప్రకారము 5 సం॥ రములు అయిదుసంవత్సరములవరకు వ్యాపారము జరిగించగలందులకున్ను ఈలోగా వర్తకము మనలో యెవరికైనను మానివేయుట కిష్టము

న్నయెడల ఆప్రకారము తమవాటా రెండవవానికి లాభనష్టములు వహించే కర్తలని వ్రాసియియ్య నిర్ణయము. ఆప్రకారము వ్రాసిపు చ్చుకొనుటకు రెండవవారు అంగీకరించినయెడల ఈవరతులతో తమ యిష్టమువచ్చిన మరియొకరికి ట్రాన్సుఫరుచేయ నిర్ణయము. ఇదిసమ్మ తిని వ్రాసుకున్న పాలివ్యాపారపు దస్తావేజు.

కొటికలపూడి సత్యనారాయణవ్రాలు
గుత్తంగి సత్తెయ్యవ్రాలు.

దస్తూరి—ధర్మవరపు ధర్మయ్య, సా॥ రాజమండ్రి.
మరా—ముప్పావలాస్టాంపు మాత్రమే.

## అద్దెచీటి

26—6—1928 సం॥రం.

సా 1 కి రు 12 లు చొ॥ అద్దెయిచ్చుటకు 3 సం॥ రములకు అద్దెచీటి.

| రాజమండ్రి నరసింహారావుపేట కాపురస్థులు వైశ్యులు బత్తుల రామయ్యగారికి— | రాజమండ్రి కాపురస్థులు శివ్వా పోతిరాజు వ్రాయించియిచ్చినది. |
|---|---|

మీకు రాజమండ్రి ఇన్నీసుపేటగ్రామములోయున్నటువంటిన్ని యీదిగువ నుదహరించినటువంటిన్ని యింటిని 1921 సం॥రం యేప్రి యలు 1 తేది లగాయతు 1926 సం॥రము యేప్రియల్ 1 తేదివరకు 5 సం॥రములు కాపురముండటకును అందుకుగాను సా 1కి రు 12లు చొ॥న అద్దె యిచ్చుటకును ఆలా నిర్ణయమైనది. అద్దె ప్రతినెలకు 1వ తేదిని యిచ్చుటకున్ను నిర్ణయము. మీయింటి మరామత్తులుయావత్తు నేను కాపురమున్నంతకాలము నేను చేయించుకొందును. ఈదొడ్డిలో వున్న కొబ్బరిచెట్లు వగయిరా ఫలములుయేమి నాకు నిమిత్తములేదు. మ్యునిసిపాల్టీ అన్నిపన్నులు నేను యిచ్చుకొందునుగాని మీకు నిమి తములేదు.

ఇందుకు హద్దులు.

తూర్పు—రయిలురోడ్డు.

దక్షిణము—గోదావరిగట్టు.

పడమర—రైలురోడ్డు.

వుత్తరం—దుర్వావారి సత్రముగోడ.

ఈహద్దులు మధ్యస్థమయిన పెంకుటిల్లు నేను అద్దికి పుచ్చు కొనడ మయినది.

ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన అద్దెచీటి.

శివ్వా పోతిరాజు వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. పుచ్చల వెంకటరత్నము సా॥ వ్రాలు రాజమండ్రి.
2. వరదా రామమూర్తి సా॥ వ్రాలు, రాజమండ్రి.

దస్తూరి—బత్తుల రమణారావు, సా॥ రాజమండ్రి.

# రశీదులు.

ది 19 మార్చి ఆ 1612 సం॥రం తేదిని అమలాపురం అచ్చన్న గారికి—

జవ్వాది వీరబ్రహ్మం వ్రాసియిచ్చిన రశీదు.

మీరు మాకుయివ్వవలసిన యింటిఅద్దె లోగడగ 1 మాసము తాలూకు అనగా ఈ మార్చి నెలాఖరుకు అయిన అద్దె రు 33 లున్ను ఈ రోజున నాకు యిచ్చినారు గనుక ముట్టినది.

ఇది సమ్మతిని వ్రాసియిచ్చిన రశీదు.

జవ్వాది వీరబ్రహ్మం వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. తెలబోట్ల సన్యాసి సా॥ వ్రాలు.
2. ఈకప్పి వీరన్న సా॥ వ్రాలు.

దస్తూరి—చినము సూరన్న. రాజమండ్రి.

ది 13 ఫిబ్రివరి ఆ 1913 సం॥రం తేదిని తెలగాలు అచ్చన్నకు అప్పన మహాలక్ష్మి వ్రాసియిచ్చిన రశీదు.

నీసేవ్యములోవున్న నా తాలూకు ఈనాముకు 1913 సం॥రం పంట బాపతు శిస్తు రు 143—0—0 లున్ను బాకీ సీదాకు యిచ్చి నావు గనుక ముట్టినవి.

ఇది సమ్మతిని వ్రాసియిచ్చిన రసీదు.

అప్పన మహాలక్ష్మి వ్రాలు

1. వేములవాడ సత్యం సా॥ వ్రాలు.
2. భమిడిపాటి రాజారావు సా॥ వ్రాలు.

దస్తూరి—బత్తుల రమణయ్య, సా॥ రాజమండ్రి.

ది 11 జనవరి 1916 సం॥రం తేదిని కడియాల సూరమ్మకి బత్తుల రమణయ్య వ్రాసియిచ్చిన రశీదు.

నీసేవ్యములో యున్న నాతాలూకు భూమి 1917 సం॥ రం పంటబాపతు మక్తాధాన్యము 20 కావిళ్ళు అనగా నాలుగువందల కుంచముల ధాన్యము బాకీ సీదాకు యిచ్చినారు గనుక ముట్టినవి.

ఇది సమ్మతిని వ్రాసియిచ్చిన రసీదు.

బత్తుల రమణయ్య వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. పిట్టా అప్పలరెడ్డి సా॥ వ్రాలు.
2. ఎంపాడ అప్పలస్వామి సా॥ వ్రాలు.

దస్తూరి—మేకల శేషాద్రిరావు, రాజమండ్రి.

ది 14 ఏప్రియల్ 1925 సం॥రం తేదిని.

| గుబ్బల తమ్మయ్యగారికుమారుడు రామస్వామికి— | మేడిశెట్టి వెంకటస్వామి కుమారుడు సత్తెన్న వ్రాయించిఇచ్చిన అగ్రిమెంటు. |
|---|---|

నాకుమార్తె వెంకటరమణమ్మ అనుదిన్నదానిని నేను పెంచ

లేక పెంచే ఆడదక్షత లేకనున్న నీవు పెంచి పెళ్ళిచేసుకుంటానని నీవు కోరినందున నీకు ఆపిల్లను యిచ్చివేయడమయినది. ఈపిల్లను యిప్పుడే నీఅధీనముచేయడమయినది. గనుక యింతటినుంచి ఆపిల్ల దానిని బాగా సంరక్షణచేయుచూ నీయిష్టమువచ్చిన కుఱ్ఱవానికి వివాహము చేసుకొనవలయును. ఆపిల్లయందు యింతటినుంచి గార్డియన్ హక్కును యావత్తు నేను వదలుకొని నీకు యిందుమూలముగా యిచ్చివేయడమయినది. ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన యగ్రిమెంటు.

మేడిశెట్టి సత్తెన్న వ్రాలు,

ఇందుకు సాక్షులు.

1. బొడశ్శ వెంకటరావు సా॥ వ్రాలు.
2. దిమ్మిర గోపాలం, సా॥ వ్రాలు.

దస్తూరీ—బత్తుల రామయ్య, రాజమండ్రి.

# వివాహ విమోచన.

లేక

# విడాకులు.

ది 11 జూను 1925 సం॥రం తేదీని.

బి. శేషమ్మకు.                                    బి. వీరయ్యకు.

వ్రాయించియిచ్చిన విడాకులు.

నీవు నాకు వివాహముచేసుకున్న భార్యవైయుండియు 2 సం॥రములు కాపురము చేసిన్ని నాతో అన్యోన్యముగా యుండుటలేనందున నీవు యితరులతో మనువువెళ్ళెదనని చెప్పుటచేతనున్ను నేను అంగీకరించి మన కులములో మారుమనువులువున్న హేతువు చేతనున్ను నేను తిరిగి వివాహముచేసుకున్న మొకల నీవు తగాదాలు చేయకుండానుండుటకున్ను ఈప్రకారము నిర్ణయించుకొని ఒకరికి ఒకరు విడా

కులు యిచ్చుకుంటున్నాము. ఒకరినొకరు యెప్పటికి యేవిధమైన తగాయిదాలు చేయకూడదు.

ఇది నాసమ్మతిని వ్రాయించి యిచ్చిన విడాకులచీటి.

బి. వీరయ్య వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. జడ్డు తాతబ్బాయి సా॥ వ్రాలు.
2. పెంటా వెంకన్న సా॥ వ్రాలు.
3. చిప్పా పుల్లయ్య సా॥ వ్రాలు.

దస్తూరి—సీమకుర్తి మల్లన్న, రాజమండ్రి.

ఆడది వ్రాసిన, దానిమీద ఆడదాని పేరే వేయవలెను.

స్టాంపు 0—12—0 మాత్రమే.

రు 500 లకు రశీదు.

ది 28 జనవరి ఆ 1928 సం॥రము తేదీని పుల్లాబొట్ల రామన్న గారికు మూరుకు సూర్యనారాయణ వ్రాయించియిచ్చిన రశీదు.

మీకు నేను యిదివరలో క్రియదస్తావేజు వ్రాయించియిచ్చి యున్నిదివరం నటురిజస్ట్రారులో 1 పుస్తకము 43 వ్యాలుం 375 పుట లో 1918 సం॥రం నెం 62 రుగా రిజష్టరీ చేయించియిచ్చిన క్రియచీటి తాలూకు ప్రతిఫలములో యిదివరలో యిచ్చినది 145 లు గాక మిగిలిన రు 355 లున్ను ఈరోజున నాపరంగా నగదు యిచ్చినందున ముట్టినది. ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన రశీదు.

పుల్లాబొట్ల సూర్యనారాయణ వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. పెంటా వెంకటరమణయ్య సా॥ వ్రాలు.
2. చెన్నుబొట్ల చెంచయ్య సా॥ వ్రాలు.

దస్తూరి—అంకం సత్తిరాజు, రాజమండ్రి.

కొన్నిరూపాయలు అయితను అనాబిళ్ళ.

2000 పాయలకు రశీదు.

ది 24 ఫిబ్రివరి ఆ 1925 సం॥రం తేదిని.

చోడిశెట్టివెంకటరత్నంగారి కుమారుడు రాజారాయణంగారికి.

అనపర్తి వెంకన్నగారి కుమారుడు రామన్న వ్రాయించి యిచ్చిన రశీదు.

మీాపేర నేడు ది 20 జనవరి ఆ 1925 సం॥రం తేదీని అస్వాధీనపు తనఖాదస్తావేజు వ్రాయించియిచ్చి రామచంద్రపురం సబురిజిస్ట్రారువారి అఫీసులో 1 వ పుస్తకం న 242 వాల్యూం345. 346పుటలలో1422 రిజిష్టరిచేయించినపత్రిముతాలూకు ప్రతిఫలముయావత్తు యీాదిగువ వివరించిన తబ్సీలు ప్రకారము యిచ్చినారు గనుక ముట్టినది.

| | |
|---|---|
| దస్తావేజుకాలమందు నాకు యిచ్చినవి | 100—0—0 |
| వెంకటరత్నంగారికి యిచ్చిన నోటు బాపతు | 800—0—0 |
| సేటు శివకర్న మారువారికి తాకట్టు బాకి సీదాకు యిచ్చినవి. | 400—0—0 |
| వేమవరపు అప్పలరాజుగారికి నేను వ్రాసియిచ్చిన నోటు తాలూకు వసూలుయిచ్చినది. | 200—0—0 |
| ఈరోజున నాకు నగదు యిచ్చినవి. | 500—0—0 |
| | 2000—0—0 |

వెరశి రెండువేలరూపాయలు పత్రిం బాపతు ప్రతిఫలముక్రింద యిచ్చినారు గనుక పూర్తిగా ముట్టినవి.

ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన రశీదు.

అనపర్తి రామన్నవ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. చేబియ్యం చెంచయ్య సా॥ వ్రాలు.

2 పూ౹రే బండమయ్య సా॥ వ్రాలు.

దస్తూరి—చిత్తు వీరయ్య, సా॥ రాజమండ్రి.

# స్పెషల్ పవరాఫ్ అటర్నీ

రాజమండ్రి కాపురస్తులు వ్యవసాయం సరెడ్డి అచ్చన్న కుమాళ్ళు బుచ్చయ్య, 2సరయ్య, 3అచ్చన్న 2, 3 మైనరులయినందున అన్న బుచ్చయ్య సంరక్షకుడుగారికి—

రాజమండ్రి కాపురస్తులు వ్యవహారము కోమట్లు సుబ్బుల సూరిశెట్టి కుమారుడు సుందరం వ్రాయించియిచ్చినది..

నేను గోదావరిజిల్లా మామిడాడతాలూకా భీమవరంగ్రామం ములోని భూమిని వెంకటాయిపాలెం కాపురస్తులు భీమనభొట్ల సుబ్బారాయుడుగారికి రు 1000 లు క్రియపరచి ౹ 19 జూలై 1899 సం॥ రం తేదీని వ్రాయించియిచ్చినాను. సదరు దస్తావేజు బిక్కవోలుసబు రిజష్ట్రారువారి ఆఫీసులో నాస్థానే నీవు హాజరయి దాఖలుచేసి దస్తావేజు రిజష్టరు చేయించుటకు నేను న్యాయముగా జరిగించునట్టుయిందు మూలముగా అధికారము యిచ్చినాను గనుక సదరు ఆఫీసులోసదరు దస్తావేజు రిజష్టరీచేయించుటకు నేనున్యాయముగా జర్గించినట్టుయిందు మూలముగా మార్చుకుంటున్నాను సదరు రూపాయిలు 1000 న్ను రిజష్ట్రారువారి ఆఫీసులో నాస్థానే నీవుపుచ్చుకొనవలయును. ఇది నా సమ్మతిని వ్రాయించి యిచ్చిన స్పెషల్ పవరాఫ్ అటర్నీ.

సుబ్బుల సుందరం వ్రాలు.

ఇందుకు సాక్షులు.

1. గోనుగుంట్ల గోపాలయ్య,
2. చేబియ్యం చెంచయ్య.

దస్తూరి—దుర్గా వెంకటరమణయ్య.

---

